శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః

రామాయణభజనకీర్తనలు.

# వాలివధ.

[ నాట ... ]






గ్రంథకర్త

## భక్తబాలకవి తేతల వీరరాఘవరెడ్డి



మొదటి కూర్పు 1000 ప్రతులు



రామచంద్రపురం

విద్యావినోదినీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను

1931

 [ As 8

# పీఠిక.

చదువరులారా! సుజనులారా!

మీకెల్లరకును సవినయపూర్వకముగ అభివందనమాచరించి వ్రాసుకొన్న విజ్ఞాపన యేమనగా?

పెద్దలప్రేమాతిశయంబుచేతను, భగవంతుని కరుణారసము చేతను, సజ్జన సాంగత్యముచేతను నాకీయూహానుజనించెను గాని యిం దునా చతురత యెంతమాత్రములేదు శ్రీరామభక్తాగ్రేసరులారా! రామాయణనాటకభజనను అనేకచోట్ల ఆడి, పాడితిని లక్ష్మణ పాత్రను ధరించి ప్రజలమనస్సు రంజింపజేసితిని అదిమొదలు నాకీయూహ జనించినది యెద్దియేనినాటకభజన వ్రాయనూహించుచుండ నావంశీయుడును ప్రాణమిత్రుడునగు మ॥ రా॥ శ్రీ తేతల సూరారెడ్డిగారు రామాయణమే వ్రాయమని నన్ను మరిమరి ప్రోత్సహించిరి. మిత్ర వాక్యముభావిశ్రేయః ఫలదాయకమని భావించి అయోధ్య, అరణ్య కాండములను వ్రాసితిని వ్రాసివిడివిడిగాపాదుకాపట్టాభిషేకము వాలివధ నుపేర్లనిడి రెండుపుస్తకములను 10 రోజుల కించుమించుగా అచ్చుకిచ్చి ముందువాలివధనే యిచ్చితిని వ్రాయవలసిన సంగతులు అన్నియు మొద టిపుస్తకమునందే వ్రాసితిని.

సరసకవిశేఖరులారా!

గ్రంథరచనకిదియే ప్రారంభముగాన ఇందనేకలోపములుండవచ్చును నాకు తెలిసినంత వ్రాసితిని శ్రీరామకథయెట్లువ్రాసినను పవిత్రమే యగునని నమ్మికమింకను భరతఖండవాసులకు గలదనిన మ్మెదను దీనిని పరిశుద్ధముచేయుట పాఠకమహాశయులవని.

తే. గీ॥ గణయతిప్రాసదెలియదు ♦ ఘనుడగాను
తధిగిణభరతశబ్దముల్ ♦ తరచలేదు
భక్తిచేవ్రాసితిని నాదు ♦ శక్తికొలది
అరయనేకవిత వ్రాయుటజనుల ♦ కద్భుతంబు!

కావున పెద్దలునన్ను [illegible] సమర్థులై నాతప్పులను తప్పులుగాభావించి న[illegible]ము గల్గినలోపములను తమరునాకు దెల్పిన యెడ [illegible]ప్పులను సవరించుకొందును భక్తియేముక్తికి ప్రధానమగునంచు యీచిట్టిపొత్తమును వ్రాసితినంతి యేకాని నేనేవిద్యయందు ప్రవీణుఁడగాను కావున చదువరులు నా పొత్తమాలించి యిదిశ్రీరామునిచరిత్రంబుగాన భక్తియేప్రధానముగ జూచుకొని నా పొరపాటులనేకంబులున్నను నీరంబులవిడి క్షీరంబుల గ్రోలురాయంచలవలె యుండలితప్పులనువదలి వప్పులనేగ్రహింతురుగాక

తే. గీ. బాల్యమందున వ్రాసితి ♦ వాలివధను
పెండ్లికాలేదు పదియారు ♦ వత్సరములు
వయసుమీరఁగలేదునా ♦ కయ్యలార
చిన్నవాడనుతప్పులున్న ♦ మన్నించమీరె.

ఇట్లు భవద్విధేయుడు

గ్రంథకర్త

భక్తబాలకప తేతల పెరాఘవరెడ్డి

-0—

# కవివంశావళి

—o—

సీ॥ ధనధాన్యములచేతనసయమున • తులతూగు
కొత్తుకాపురివాసు • కాపురంబు
సేద్యవృత్తినిబూని • జీవకోట్లనుబెంచ
దలచెడు భూమండి • రెడ్డకులము
నశ్యాభవరఘునూళ్ళ • గోత్రోద్భవంబున
తేతలాబ్ధికివన్న • దెచ్చినట్టి
భూవయాఖ్యునినుతుడు • భూలోకనాముండు
బల్లెమాంబయుగన్న • పుత్రులందు॥

తే॥ గీ॥ ఏద్వితీయుండవీరారెడ్డి యయ • నేనువాడ
రామచరితంబు వ్రాసితి • దీనిమీర
భక్తవరులెల్లదీసి • పఠించునపుడు
కోపముంచకదిద్దుడీ • లోపమున్న॥

## కృతిసమర్పణ

---

తే॥ గీ॥ వాలివధియించి సుగ్రీవు • నేలినట్టి
దేవుకృపచేతగల్గెయీగ్రంథ • రచన
గానవిచ్చితి నాకృతి • భానుకులునకే
కార్యమెల్లనురాముడే • భారమనుచు

శ్రీరస్తు

శ్రీగణేశ్వర ప్రార్థన

శా॥ శ్రీగంధిల్లెడు పాదపద్మములకున్ । జేజేలు నేఁజేతుల్వంపై
ఏరా వేళను జూపు పర్వములంతా । వీక్షించినీకొక్కయా
దారిం భీతిచెవచ్చెనో యువగవే । దామండ్ర ప్రార్థించగా
రారా శ్రీగణనాథ కోర్చెదనినున్ । రక్షించరా కావ్యమున్॥

1 రూపకము — సావేరి

1. ఏకదంతమా ♦ కోర్కె దీర్చుమా ఆ ఆ ఆ । ఏ ।
లోకనాయకవినునే ♦ వాక్కున బల్కెద నెవ్వడు
శ్రీకరముగ నా కార్యము ♦ సాగ జేర్చ శివకుమార
(మిశ్ర) విఘ్నంబుగ నిమ్మనే ♦ మక్కువతో నమ్మితిని
యిక్కార్యంబెల్లనీవు ♦ చక్కగ నెరవేర్చు దేవ । ఏ ।
2. భక్తితోడ నీపదములు ♦ భజియించెద నయ్య చాల
శక్తిపరుడవనుచు నిన్ను ♦ చేరిగొలుతు రారమ్మ
(మిశ్ర) మ్రొక్కెదనో దేవ నీకు ♦ మూర్ఖతలో బడద్రోయకు
కొక్కె తేజరాతా ♦ కోరెదనిక బూజ్జ దేవ । ఏ ।
3. పరిపరి విధముల నిన్ను ♦ మరిమరి వేడిన గాని
కరుణజూపవేరయో ♦ గౌరీసుల ముద్దుపుత్ర
(మిశ్ర) బింబిని నీవిప్పుడొచ్చి ♦ స్థిరముద్దుల కవిత నిమ్ము
ధీబుద్ధితో వేడితి ♦ దివ్యముగా వుండ్రిథతు । ఏ ।
4. పాపజందెముల మేటి ♦ కోపమేల వేడుచుంటి
ఆపదలో మునిగియుంటి ♦ ఆర్తి నిరీక్షించుమంటి
(మిశ్ర) భూపయాఖ్యుమచుమడనై ♦ భూమిని నే వ్రాసితిని
శ్రీపతిచరితం బిప్పుడు ♦ శీఘ్రముగా నెరవేర్చుము । ఏ ।
5. మోదకభక్షణనాపై ♦ వాదమేలకన్న తండ్రి
ఆదరమున భక్తులను ♦ అనయము బ్రోచెదు దేవ
(మిశ్ర) రాఘవరెడ్డిని బ్రోవగరమ్మా ♦ శ్రీ విఘ్నేశ్వర
రామాయణకథభూమిని ♦ రమ్యముగా ప్రకటించర । ఏ ।

## —: సరస్వతీ ప్రార్థన: —

తే. గీ. కమలభవు రాణి - సమ్మోదగాన పాణి
సరగములేనట్టి నా - నాల్కయందు నిలచి
సరసకవితమునిమ్ము యో - సత్యవాణి
లచ్చికోడలనిను కొల్తు - నిశ్చయముగ।

2 శ్రీరాగం — రూపకం

1. అమ్మా నమ్ము బ్రోవుమా ♦ నమ్మితినో నినుదలచెద ॥ న ॥
నమ్మనమున నేనెంతో ♦ యిమ్మహి నినుబొగడుచుంటి
కమ్మహృత్కమలంబున ♦ సమ్మతించి కవితనిమ్మ
(మిత్ర) తమ్మిచూలిరాణి ♦ యిటు తెమ్మా నీచేతవీణె
సమ్మోదకో లోకవాణి ♦ నెమ్మదిగా రాజనని ॥ అ ॥

2. పాత్రంబున ముత్తైదువ ♦ యిత్తరినీవచ్చిబ్రోవ
చిత్తంబున వేసుచుంట ♦ శక్తిలేనివాడ తల్లి
(మిత్ర) యుక్తంబుగ నవసరిమాలు ♦ మొవ్వాజేయుకల్పవల్లి
ముత్యపుసరులో యునంగ ♦ ముచ్చటలల్లిన రీతిని
అచ్చంబగు ♦ మాటలతో అభినవతార్కజ్ఞానము
సందముగా ♦ నొసగవమ్మ ॥ అ ॥

3. యాలలోనినుబోలునట్టి ♦ యింతులుగలరే తల్లి
కలకాలమునినుదలచెద ♦ అలుకగొనకుమమ్మ
ఓవలుకువెలది నాపైని (మిత్ర) కలనైననునినుమరువను
పల్లవపాణిరో నిజము ♦ చల్లనికృపజల్లుమింక తల్లిరో నను బ్రోవశంక ?
॥ అ ॥

4. స్వచ్ఛమైననీరూపము ♦ మెచ్చుటనుండనో తల్లి
యిచ్చుటకొకసారిరావ ♦ వచ్చువిల్తువదిన
(మిత్ర) మచ్చకంటి కౌతుక ♦ పురమందున నీజాడలేదు
విచ్చలవిడిగా తేతలవీర ♦ రాఘవరెడ్డిని బ్రోవగరా ॥ అ ॥
జననీనినునమ్మితిని ॥ అ ॥

సోదరులారా!

మన కాధారంబగు శ్రీరాముని చరిత్రిందెల్పెద సావధానులై వినుడు.

సీ॥ శ్రీరామపదభక్తి ♦ చింతామృతంబును
గ్రహియించు భక్తాగ్ర ♦ గణ్యులార
నవరసాలంకార ♦ నైపుణ్య తేర్పడ
కథలు వచించెడి ♦ గణికులార
జాతీయ మేర్పడ వరసోక్తి ♦ హాస్యముల్
ప్రజల మెప్పించెడి ♦ ప్రభువులార
ఆత్మతపోనిష్ఠ ♦ హరికైనబంధించి
సాహసించెడు దివ్య ♦ సాధులార

తే॥ గీ॥ వినుడు శ్రీరామసత్కథ ♦ వీనులార
కోపముంచక నాయందు ♦ లోపమున్న
ముద్దుసుతురీతి తప్పు ♦ దిద్దుడయ్య
భక్తవరులార యోగభా ♦ ప్రౌఢులార॥

అ సావేరి — ఏకతాళం

1. సుగుణులార వినుడు శ్రీరఘురాముని చారిత్రము ॥ సు ॥
జగతునిత మ్మునికి ♦ తెడుపంతయుతో రాజ్యమొసగె
ఖగవాహనుడయ్యె యిడను ♦ గంగానాథుని ప్రియుడు ॥ సు ॥
2. లక్ష్మీపతి భువనంబులు ♦ కుక్షిలోన దాల్చినవాడు
పక్షికి మోక్షంబిచ్చిన ♦ భగవంతుండీ రాముడు
రక్షకుడీతడు మనకు ♦ రాత్రించరభంజనుండు ॥ సు ॥
3. భూమిభారమున్ దీర్పగ ♦ యిమ్మహిలో జన్మమెత్తె
తమ్ముచూళిజనకుడితడు ♦ తనయుకయాచారిత్రము
సమ్మతితో విన్న ♦ వరనిహామందున సౌఖ్యమబ్బు ॥ సు ॥
4. దశవేషముదాల్చినట్టి ♦ దశరథేశు ముద్దుపట్టి
పశుపతివిల్లును బట్టి ♦ వసుధపుత్రిగొనినట్టి
అనమానవు శౌర్యరాశి ♦ పశముకేముకొనగమనము
ఒకసారి భజన చేసి ♦ యశముగాంచ కౌతుకపురిహానుడు
వీరరాఘవుని వాఖ్యామృత ♦ రసముగోరిల ॥ సు ॥

# ఇందుదరించు పాత్రలు

—o—

| | | |
|---|---|---|
| 1. | శ్రీరాముడు | |
| 2 | లక్ష్మణుడు | |
| 3. | అత్రి | |
| 4 | శరభంగుడు | గొప్పతపశ్శాలి |
| 5. | విరాధుడు | తుంబురుండు అను గంధర్వుడు |
| 6. | రావణుడు | లంకాధిపతి |
| 7. | మారీచుడు | రావణుని మేనమామ |
| 8. | జటాయువు | |
| 9. | కబంధుడు | ధనువనే గంధర్వుడు |
| 10. | సుగ్రీవుడు | |
| 11. | హనుమంతుడు | |
| 12. | దూమ్రాక్షుడు | రావణుని సేవకుడు |
| 13. | వాలి | కిష్కింధాధిపతి |

సమయానుకూలముగ కొందరు వనచరులువత్తురు

## స్త్రీలు.

—o—

| | | |
|---|---|---|
| 1. | సీత | |
| 2. | అనసూయ | అత్రిమహాముని భార్య |
| 3. | శూర్పణఖ | రావణుని చెల్లెలు |

సమయానుకూలముగ కొందరు రాక్షసస్త్రీలువత్తురు



శ్రీ ర స్తు:

# వాలివధ.

(రంగము అరణ్యము సీత రామ లక్ష్మణుల ప్రవేశము)

శ్రీరా—లక్ష్మణా! ఈకానన సంచారము రాజ్యరక్షముకంటె యోగ్యమనితలచెద వలయునిన.

తే॥ గీ॥ హాయిగానుండెవనవాస ♦ మరియుగాక
తాపసులయాశ్రమంబుల ♦ దర్శనంబు
గల్గుచుండెను మనకింత ♦ కంటెగలదె
కైకవనిజేర్చి పుణ్యంబు ♦ గట్టుకొనియె॥

ఆహాహా! కాంతారసౌఖ్యంబునకును అంతఃపురసౌఖ్యంబులకును చాలభేదముండెనుసుమీ!

తే॥ గీ॥ నరకహేతువరాజ్యము ♦ నాశ్రయించి
ఆశవిడనాడలేరు ♦ ఇహమందునరులు
గానశాశ్వతమోక్షంబు ♦ గనగలేరు
హానులేనిత్యసంపన్న ♦ ఘనులుసుమ్మి॥

లక్ష్మ—అన్నా! నేటికినాయజ్ఞానంబు విడచిపోయినది మీకుదెల్పు ఈపరమజ్ఞానంబు మీపాదసేవచే నాకు సంప్రాప్తమయ్యెను

సీత—ప్రాణేశ్వరా! నేనుసుధన్యురాలనైతిని సాకేతపురమున నున్న ఈ తాపసకన్యల దర్శనమునాకులభించునా! పట్నములకన్న మునిపల్లెలయందుండుటయే సౌఖ్యదాయకము అటుగాక అల్లదే! చూడుము.

తే॥ గీ॥ రాక్షసాంతకజానుమా । పక్షిజంట
పేర్మితోఁ బండ్లభక్షింప । పెంచిపక్షి
నీలవర్ణముబోలి ర । పాలమందు
వరుసగూర్చుండె మీతో నే । వచ్చినట్లు॥

రాము—కాంతా! హాస్యములకేమిగాని మునికుటీరములదగ్గింపవల
యు త్వరగారమ్ము.

సీత—నాథా! హాస్యమనదరేల? అల్లవిగో చూడుడు ఆరెండుపక్షు
లును సీతారాములవలెనే జంటవిడువకపోవుచున్నవి.

రాము—కాంతా! నవ్వులాటకేమిగాని నిన్నుచూడనాకులోలోన వి
చారము పొడముచున్నది ఏలయన అతిసుకుమారివి ఈయ
డవుల కష్టంబులనుభవించలేవని సంశయించుచుంటిని.

సీత—ప్రాణనాథా! ఏమిమీసంశయము విడువుడు నాకేఁగవలని
లేదు లోకైకనాథులగు మీవెంటనున్న కీకారణ్యము నాకసౌ
ఖ్యమువలెనుండును!

4 మోహన — త్రిశ్రజాతి

1. ధన్యురాలనైతిని మీదాపునున్న । శ్రమలకేల ॥ధ॥
అన్యముగాదలపకుండి । యడవిదిరుగయానందము ॥ధ॥
2. నాకొరకై మీరలు యి । ట్లనుమానించగవలదు
ఈకానలదిరిగిమున్న । ఋషులకాంతలనేకులు
లోకంబునఖ్యాతిగాంచి । నాకపదవికేగలేద ॥ ధ ॥
3. తిన్నగమీవెంటనేను । బన్నముఁగాబడినగాని
అన్నియుసుఖములు । గాదోచునయ్యా
కీకారుణ్యము బ । య్యంబేలనునాకు ॥ ధ ॥
4. నాథుడు వెంటనులేని ♦ నాతిబ్రతుకుకానగాచు
వెన్నెలకరణిన్ గాదె ♦ వేదవేద్యమీపాదము
యిప్పుడుఁభజియించుచుండు ♦ నాతికినాకేమికొదువ
తేతల వీరెడ్డిదాను ♦ ఖ్యాతిగాంచెనిమదలచి
పాతకమెల్లనుబాసె ♦ పలువిధసంకోచమేల ॥ ధ ॥

సీత— ప్రాణవల్లభా! మీతో వచ్చుటచే యీపుణ్యనిధుల స్నానం
లభించెను పుణ్యవతులదర్శనముదొరకెను

రాము— చెలీ! త్వరితముగా నదదిరమ్ము ఆలసించకుము

లక్ష్మ— అన్నా! అహాహా! ఆదిత్రిముజూచితిరా కడు వేసవికాలం
బున అడవియెల్లయెండి ఆఎనుబది చెట్లు శరత్కాలంబున ప్ర
వరించుభంగి పుష్పఫలంబులతో నిండియుండె ఏమియీచి
త్రము వహ్వా!

రాము— సౌమిత్రి! అదిఅత్రిముని యాశ్రమము:

తే. గీ. పరగమూర్తిత్రయంబును ♦ బాలకులుగ
జేసియశమునుగాంచిన ♦ భామరాంగి
అత్రిమునిపత్ని అనసూయ ♦ నాశ్రమంబు
నందునుండెడు చెట్లు పెం ♦ పొందుచుండు॥

లక్ష్మ— అహా! ఆపరమపతివ్రతా మహాత్మ్యమే కాబోలును మన
మందుచేరి వారలదర్శించెదము.

(రంగము—పర్ణశాల)

(ప్రవేశము అత్రి అనసూయాలు)

అత్రి— కాంతా! ఆవచ్చువారు సీతారామలక్ష్మణులు వారు మన
ఆశ్రమమునకు విచ్చేయుచున్నారు కావున నీవుత్వరగాలో
నికేగి వారికిఏందుచేయుతగుప్రయత్నముజూడుము.

అన— నాథా! వారు సీతారామలక్ష్మణులా! మన మెంతధన్యుల
ము ప్రాణేశ్వరా! యిక ఆలసించకబోయి వారికితగుభోజన
ఫలహారంబుల ఏర్పరిచెద.

అత్రి— కాంతా! శీఘ్రముగ వెళ్ళుము

అన— చిత్తము: (అనిలోనికేగును)

8. రాచకులమువందు శాంతు ♦ రమణీనీవెరిగివదే
భామరముగ కౌతుక పురి ♦ వాసులెల్ల సంతసమున
జేసిరి మహోత్సవములు ♦ చూచెడి చిత్రంబులన్ని
శ్రేష్ఠతరమె ♦ వర్ణించగ ॥ పెం ॥

అన — అమ్మా! నీపెండ్లి మహోత్సవవార్త విన్నంతనె నాకానందమువంతసము పొడముచున్నది. అమ్మా! మీరిందువచ్చితిరి గాన మంత్రోక్తంబగు కుంకుమ తిలకముగ ధరించుకొమ్ము నీకిముందు కాలమునకు చాలా సౌభాగ్యము సౌఖ్యవనరము (బొట్టుపెట్టును)

సీత — అమ్మా! అనసూయ మీయాశీర్వచనమొసగిచ్చేయుటవల్లనా బదలికలన్నియు తీరెను.

రాము — మునివరా! మేము ముందునకు పోవలయు సెలవిచ్చెదరా?

అత్రి — దేవా! మాయామానుషాకారముగ మనుష్యరూపవతరించిన మహానుభావుడవు మీదర్శనమున మాతపములన్నియు ఫలించెను.

రాము — మహానుభావా! మునివరా! యిమ్మహారణ్యంబున మాకు యోగ్యంబగు స్థలమెచ్చటనో చెప్పుడు.

అత్రి — శ్రీరామా ఇచ్చటికనతిదూరంబున సముద్రప్రాంతము పంచవటి కేగుడు అందుమంచిఫలంబులతో నుండెడు చెట్లును విహారమునకు చల్లనిగాలియు సౌఖ్యముగనుండును.

సీత — అమ్మా! అనసూయ సెలవొసంగెదరా!

అన — అమ్మా! దయావుంచుము

అత్రి — రామా! నాకుశలవు

రాము — చిత్తము

(అత్రి అనసూయలు నిష్క్రమింతురు)

బోను నీమచ్చనూపెదను అరుగో! నానాథునుజూచితివా!

విరా- నీనాథుఁడేమిఁజేయునే చెలీ! నేవిరాధుఁడనురాక్షసుఁడ నిరాటంకముగా నిన్ను ఇప్పుడువిడువను నీరాముఁడుగీముఁడు ఏమిచేయుదురో జూచెదగాక! కారులాడకుము.

సీత- నాథా! ఏమిటిట్లుజూచెదవు అయ్యో! యీరక్కసుఁడుజేయుచు వికటాట్టహాసంబు వూరకొనెదరేల! సౌమిత్రీ! నీవైనను నన్ను విడిపింపలేవా! యీకూ్రరుఁడునన్నాకాశవీధినిగొనిపోవుచున్నాఁడు.

సీ॥ కరుణించి జో్రవరే మునులార ♦ జనులార
గాంచుచుంటిరె నాదు ♦ కష్టదశలు
కూ్రరాత్ముడైన యీ ♦ విరాధుపాల్పడితి
అక్కటానను బో్రవ ♦ దిక్కు లేదు
సిద్ధులార మీరు ♦ యుద్ధరీతి్రమెత
రక్షింపలేరొకో ♦ యక్షులార
మాయలో ముంచె ♦ నామదినిప్రాణేశు
దయలేకననుదెచ్చె ♦ దానవుండు॥

తే॥ గీ॥ అంబరంబున కేగెనా ♦ కన్నుబడరె
కుంభినీతలమైన మీకింత ♦ కోపమేల
ఏమిసేతును యింక నా ♦ కెవరుదిక్కు
గానరారైరి నాపూర్వ ♦ కర్మఫలము॥

తల్లీ! ఎందుకుగంటివమ్మా భూదేవత నీకన్నకడుపుగాలిపోవుచుండ కఠినపాషాణంబైపోయెనా నీమనసు ఓయిశరీరి నీవైనగాపాడవా!

విరా- (నవ్వుచు) ఓసివెర్రిదానా? ఏలయీలీలజేలవై వాపోయెదవు. వీరందరువచ్చినిన్ను రక్షింతురనియానీయాశ! యువియున్నియూవిడదిసెట్టుము. నన్నువ్యర్థునిగా తలంచితివి! నాపరిభావంబునీవెరుగవు యిటుం వినుకాంతా!

తే. గీ. వసుధలోనన్ను గెల్వ • నెవ్వనితరము
విమలవమారత్నములో • నేపెరుసైన
నీగ్గజేతునుబర్గరుల్ • కొట్లచేరు
బిక్కనరులెంతనాముందు • పద్మనేత్రి॥

సీత— ప్రాణవల్లభా! అయ్యో! పలుకుంటివేమి! మరదీ! నను విడిపింపశక్తిలేద యీయధముని యమపురికి బంప సమర్థులు కారా! అయ్యో! ఇదియేమి వింత! మీ శౌర్యములు ఈయెడ నడగలసెనా! సమయంబునకు ఉపయోగించలేని మీ సాహసము లేల! మీచేతవిల్లమ్ములేల! ఈ పాతకుడు నిర్భీతుడై మీ సీత నిట్టుకుపోవుచుండ భూతలమెల్ల ప్రఖ్యాతివహించిన మీరు చేతగానిభంగి యూరకొనుట నాలలాటమందు లిఖించిన విధాత వ్రాతయా! లేక దీనిజూచి మీకు భీతియా! ముల్లోకవిఖ్యాతులగు మీ విల్లమ్ముల చేతం బట్టుకొనియుండుట మోతచేటుయా! కాక నా ప్రారబ్ధకర్మచేత ఈ క్రూరునికప్పగించి మీరూరకుంటిరా! హా! ప్రాణేశ్వరా! మీ కాంతారత్నము నకట్టి గతిసంప్రాప్తమయ్యె! హా! అనాథనాథ నాపై నీకింత వాద!

10 జంఝూటి—రూపకం

1. పలుకరేల ప్రాణభీతి • పలుకలేదమీ మనమున ॥ ప ॥
ఖలుడు జేయుచేష్టలన్ని • కనులముందు జూచుచుండి
నిలువుననిర్జీవులైన • తలచెరినన్నొకరైన ॥ ప ॥
2. యుద్ధపతిని యుద్ధరాత్ము • ప్రముచ్చలించయూరకొనుట
యుద్దరిలో నొకరికైన • విడిపింపగశక్తి లేద ॥ ప ॥
3. అక్కట ఈరక్కసుండు • చిక్కులుబెట్టగనన్ను
మక్కువలేదా మీకు • మానధనా! దీనావనా! ॥ ప ॥

4 జాలిలేదనీలకంఠ జానకినీవైనబ్రోవు ♦ హాలాహాల
భక్షకసీమింతురి ♦ నాలినిగాపాడరావ ॥ వ ॥

5. కౌతుకపురివాసా శ్రీ ♦ కేతలవంశాబ్ధిసోమ
అనతారధరుడవనీకు ♦ అపరాధినిమన్నింపవ ॥ వ ॥

సీత— ప్రాణేశ్వరా! నాపైయీనుకోపమా! లేక నేమందుచేయుపాపమా! నాపైనీకుకోపమా? యిట్లనాథనైయడలుచుండ దనుర్బాణుడవై వివి యిట్లూరకొనుట న్యాయమా? హా!

రాము— (విచారముతో) లక్ష్మణా! అయ్యో! చూచితివా! దశదిశలకీర్తినింపిన దశరథునికొడుకు అసురాంతకుడని పేరుగన్న రామునినతికెట్టియిక్కట్లు సంభవించెనో! అయ్యో! ప్రాణనాయకీ! ఏమిసేతును ఆకూర్యుడు ఆకాశమార్గమున చనుచున్నాడు.

తే॥ గీ॥ వద్దువద్దని నేనెంతో ♦ ముద్దుగాను
చెప్పవల్లలు నీవు పెడ ♦ చెవినిబెట్టి
వచ్చితివికాననంటుకు ♦ నిశ్చయముగ
వినకపోతివి నామాట ♦ వనజనేత్రి॥

లక్ష్మణా! మీవదినకెట్టిఆపదసంభవించెను అహా! ఏదంతరము భవనములనుబాచుకొంటిని నావలన అరణ్యవాసములభించె.

లక్ష్మ— అన్నా! ఒకతుచ్ఛునికై యిట్లువనటజెందెదవేల! నీమువమూశ్రమములో వానియూమరులదీసెద (విరాధునిజూచి) ఓరీ కలుషాత్మ!

తే॥ గీ॥ దొంగచాటున వచ్చిన ♦ భంగపుచ్చి
పోవుచుంటివనిన్నిదే ♦ పొగరడంతు
మంటిగల్పెదతుంటరి ♦ బంటువైన
ఎరుగజేతులక్ష్మణుండు రా ♦ పిరికివంద॥

రామ- సోదరా! బహుశాస్త్రాలోచించితిని. వీనిమారణము వేఱొకవిధమున మనకువశముకాదు అట్లుచేయుదము (చెరియొక భుజము నరకుచున్నారు)

(విరాధుడు భూమిపై వ్రాలుచున్నాడు)

లక్ష్మ- అన్నా! అయినదితనపని యికమనకష్టములు గట్టెక్కెను.

రామ- లక్ష్మణా! వీనినిట్లువిడువవలదు మాయలకుపుట్టినిల్లగు దైత్యులనమ్మరాదు అవయవములు బాగుగాఖండించెదము (అట్లు చేయుదురు)

(అవసానదశయందు విరాధుడు మెల్లగామొగమెత్తి)

విరా- ఓ పురుషులారా! మీరెవ్వరు!

లక్ష్మ- మేము సాకేతపురరాజగు దశరథునిపుత్రులము? దానవహారులగు రామలక్ష్మణులము.

విరా- ఓహో! శ్రీరామ! మహానుభావా! నావంటిదుష్టులను సంహరింపజనించిన అవతారపురుష! రక్షింపుము రక్షింపుము (చేతులుజోడించును) దేవాదిదేవా తెలియకనిమ్ము నేననేకవిధముల బాధించితి తప్పుసైరింపుము!

శ్రీరా- అయ్యా! నీవెవ్వడవు నీచరిత్ర యద్భుతముగాదోచెడిని నీవిట్లుండ కారణంబేమి?

విరా- శ్రీరామచంద్రా! నేను తుంబురుడను గంధర్వుడ కొండొకశాపకారణంబున యిట్లుండి విరాధుడనునామంబుచే దురాత్మరాక్షసుండనైయుంటిని.

శ్రీరా- కొండొకకారణంబేమొ తెల్పరాదా?

విరా- పరమపురుష ఇటువినుము.

అనుసింధుగ్రుడు మిమ్ముదితిగతిగారదించును. నాకకేలకగుని
ట్లువిడది పెట్టక యిందు బాధి పెట్టును- రామా! జగదాధి రామా!
లక్ష్మణా! హా! సీతా! లోకమాతా! ప్రా...ణములు...
పో...వు...చున్నవి. హా......హా......(ప్రాణములువి
డచును:

రాము- లక్ష్మణా! వింటివా! యితనిచరిత్ర మెంతవింతగానున్నదో!

లక్ష్మ- అన్నా! ఎంత బాధించెదమనల నీక్రూరుడు అయ్యయ్యో! లో
కమాతా! నీకట్టిబాధ సంప్రాప్తమయ్యెనమ్మ (రామునిజూచి)
అగ్రజా! మూపదినమూర్ఛిల్లినది. మూర్ఛ తేవదీసిపోవుదము
రమ్ము (మూర్ఛతేవదీసెదరు సీతలేచి).

సీత- నాథా! మరది! మీరెట్లువచ్చి ఏదాక్రూరుడు వీరెట్లాకలు
షాత్ముని బారినుండి తప్పించుకొంటిరి! హా! ప్రాణేశ్వరా! అ
య్యయ్యో! మనలనెంత బాధించెను కనుపించడేమి వానినివధిం
చితిరా! లేక మిమ్ము మోసపుచ్చిపారిపోయెనా!

రాము- కాంతా! చింతదక్కుము.

—: పంచపాది: —

తే. గీ. యితనిచరితంబు దెల్పెద ♦ యింతివినుమ
తుంబురుండనుగంధర్వుడు ♦ తోయజాక్షి
రంభప్రియురాలు ఇతనికి ♦ రంగుగాను
ముద్దుప్రియురాలు వలబడి వధు ♦ వద్దువిలాక
కృథు బెలిగాదుచలముతో ♦ శాపమిచ్చె

తదుపరి యాతడు అకళంకుని అనేకవిధములప్రార్థింప దయాళుడై రాము
లక్ష్మణులు నీభుజములు ఖండించునారు నీశాపవిముక్తి అగునని పల్కెను
ఇంతియే యితనిచరిత్రము అతనికళేబరము అచటనున్నది జాతకత

గాక రమ్ము లక్ష్మణా! రమ్ము పోవుదము ( కదలెదరు )

లక్ష్మ- అన్నా! యితని దేహమందు పాతిపెట్టి తరువాయి శరభంగుని దర్శింపబోవుదము.

సీత- లక్ష్మణా! యిదియేమి యిదివరకు ఘోరాకారమున కాన్పించుదా నవ్వుడు యిట్టుమారియుండెనేమి ఇంతగానున్నదే!

రాము- ప్రాణేశ్వరీ! యిదివరకు జెప్పితినిగాదా! యితడు గంధర్వుడు యిక జాగుచేయక యిక యితని శరీరము నిందు పాతిపెట్టెదము లక్ష్మణా! చూచెదవేల తెమ్ము కాలయాపన మేల ( విరాధుని శరీరము పాతి శరభంగుని దర్శింప బయలుదేరుదురు )

అడుగు కీర్తన.

14 బారువ—ఆదితాళం.

1. నిండు ప్రేమచేసెడుచుండె తాను ♦ యెందుజూచితో ॥ నిం ॥
కొండలనక మఱికొండలనక చాల్ ♦ ముందునకనుయా ముగ్గురుగూడి ॥ నిం ॥

2. రంగాముందు రాఘవుడు ♦ వెనుక లక్ష్మణుడు
సుందరిసీత ♦ పొందుగ మధ్యను ॥ నిం ॥

3. నిరంతరము మౌనుల దర్శించుచు ♦ దురాత్మరాక్షస
క్రూరుల దునుమించుచు ॥ నిం ॥

4. శరభంగుని యాశ్రమంబు జేరగ ♦ శరాసనంబు కేలనుదాల్చి ప్రాకా
నిరంతరము విక్రీడిన్నిబోడి ♦ పరాత్పరుడు శ్రీరామచంద్రుడు ॥ నిం

రాము- తమ్ముడా! అగస్త్యుని, శరభంగుని, సుతీక్ష్ణాది మహాభక్తుల సందర్శించి దర్శింపగలిగితిమి యిక పంచవటీతీరమునకు బోపలయును.

లక్ష్మ- అగ్రజా! దర్శింపవలసిన మౌనులనందరిని ముదముతో దర్శించితిమి యిక జూడవలసిన మునాశ్రమములన్నియు గాంచితిమి

ఉ॥ శక్తిహరించవే సిమికి ♦ చెవత్రుటగ్రిమ్మెనునాము మేనా ఏ
యుక్తి నిబోధుపంచవటి ♦ యుర్విని పాదము మోవజాల వి
రక్తి జనించె ఘోరవని ♦ రాళ్లనుకంటకతూట్లు చేత మేఁ
రక్తము గారుచుండెసిక ♦ రావగనీశ్రిమనిట్లునోర్చెదన్.

ఓ విధాతా ఏలసృజించితివి నన్ను నీ వాత్రిత కాలిపోను నాథ! ఆకుటిలస్వభావి కైకవలన మనకిట్టి బాములు సమకూరుచుండె హా! ప్రాణేశ్వరా! యికనేనడువజాలను అయ్యయ్యో! ఘోరారణ్యమందు ఎట్లుసంచరింపగలను నాథా! ప్రాణనాథా! యికనేనడువజాలను (చతికిలబడును)

రాము- లక్ష్మణా! మీవదినకెంతకష్టము సమకూర్చితినో చూచితివా నిరంతరము భాగ్యభోగ్యములం పొందిన కాంతకు నాకతంబున యీయరణ్యవాసము లభించె అయ్యో యీయింతికెంతగతిగల్గెను:

సీ॥ యిచ్చవచ్చినభోజ్యమింపార ♦ భుజియించు
కాంతదుంపలుదిని ♦ గడుపవలసె
హేమసౌధంబుల నెక్కజాలని కాంత
ఎత్తైనకొండల ♦ నెక్కవలసె
పుద్యానవనముల నుండెడు ♦ పూబోఁడి
కూరరంపు బాదలందు ♦ దూరవలసె
విరిశయ్యపై నిద్రగావించు ♦ యీకాంత
పాషాణములపై ♦ బండవలసె॥

తే॥ గీ॥ కటకటా నన్ను బెండ్లాడ ♦ నకారణముగ
కష్టములగుందె దివాస్సెనా ♦ స్వల్పకర్త
ఏమిసేతును బాధచే ♦ నెట్లుజూతు
ఘోరభ్రాంతినుదస్పోంచు ♦ తెరిమెఱగతి॥

జనకునింట పెక్కు భోగములనొందిన కాంత! నాకతంబున ఆపన్నల

దిరుగవలసె లక్ష్మణా! నీవుపోయియీసమీపమున ఎచ్చటైననీ
రములున్నవేమో తెచ్చియీపడతికొసంగుము.

లక్ష్మ- రామా! మావదినెభ్రాంతిగాననడువజాలకున్నది. మనముపంచవ
టిజేరుటెట్లు (ధైర్యముగా) అగ్రజా! చింతింపకు మావదిని
గారిదాహముదీర్చెద

తే॥ గీ॥ అన్నభూపుత్రిదాహమిం ♦ పారదీర్ప
నీరమును దెచ్చుక్షణములో ♦ నిశ్చయముగ
బడలికెల్లనుదీర్చియా ♦ పంచవటికి
జేర్చవచ్చును మెల్లగా ♦ శాంతిజేసి॥

(కమండలముతో నిష్క్రమించును)

రాము- కాంతా! లెమ్ము ఏలదుఃఖించెదవు భగవంతుడుమనకు పగతు
డాయెను.

సీత— (మెల్లగాలేచి) నాథా! యింకనెంతదూరమున్నదిప ంచవ
నడువగజాలను నాథా! పంచవటిసమీపమునకువచ్చితిమా! లే
దా! దేవా! మిక్కిలిదాహమగుచుండెనిక మాట్లాడజాల (సొ
మ్మసిల్లును)

రాము- ప్రాణేశ్వరీ! అయ్యో! అదిగో లక్ష్మణుడువచ్చుచున్నాడు
నీరముదెచ్చుచున్నాడు నన్నుమ్రింతదుఃఖవార్ధిలో ముంచకు.

(ప్రవేశము లక్ష్మణుండు)

లక్ష్మ- (తనలో) అహా! మాయన్నగారు సీతాంబవమునశ్రమములజూ
చి చింతాక్రాంతుడైయున్నాడు. నేనుతక్షణమేపోయి లోకమా
తదాహముదీర్చి మాయన్నగారిసంతాపముదీర్చెదగాక (రా
మునిగాంచి) అగ్రజా! నీరముదెచ్చితిని.

రాము- కాంతా! లక్ష్మణుండు వచ్చెను లెమ్ము.

రాము- తమ్ముడా! బాగుగానున్నది పర్ణశాలకుతగినసామానులు సిద్ధపర్చుము.

లక్ష్మ- చిత్తము.

(పర్ణశాలనిర్మించుకొని అందుండిరి)

(యిట్లు ద్వాదశేంద్లసుఖదాయకముగనుండిరిపదిమూడవవత్సరములో ఒకదినము)

రాము- లక్ష్మణా! నేను

తే. గీ. దానవునిజంపి శరభంగు ♦ దర్శనంబు
జేసితిమిమున్న యామును ♦ చేరవచ్చు
చుండె లక్ష్మణా! నీవేగి ♦ పండ్లుదెమ్మ
విందుజేసెద మతనికి ♦ యీదినంబు॥

లక్ష్మ- చిత్తము. అగ్రజా! పోయివచ్చెద.

రాము-త్వరితముగా రావలయునుసుమీ! రుచ్యములగు ఫలముల దెమ్మ.

(లక్ష్మణుడు నిష్క్రమించును)

సీత- నాథా!

తే. గీ. గడపితిమి ద్వాదశేంద్లు యీ ♦ కాననమున
అదియుగాకను పదమూడవ ♦ త్సరములో
అష్టనవమాసములుకూడ ♦ నరుగుచుండె
పంచవటి సౌఖ్యమేమని ♦ యెంచవచ్చు॥

నాథా! నిరంతరము వనవాసమే మేలని తోచుచున్నది.

లక్ష్మ- నేను శరభంగమహానుభావుడు వచ్చునని అగ్రజుడు వచించెను. కావున రుచ్యము లగు ఫలముల వెదుకవలెను. ఆ పరమభక్తుడు వచ్చులోపలనే నిల్లు చేరవలయును. గాన

త్వరితమే పండ్లగోసెదను. సంపెంగ, గులాబి సెంట్లు మొదలగు పుష్పములుకూడ తీసుకపోయెద.

(చురుకుగా నడచుచున్నాడు)

[పైనుండి ఖడ్గమొకటి రివ్వున లక్ష్మణుని ముందరపడును]

ఆహా, యిదియేమి? పైనుండి వాడిగల ఖడ్గము నాముందు బడినది. విచిత్రముగానున్నదే! ఎవరు కాన్పించడములేదు. యిది ఆకాశము నుండి బడుటకు కారణమేమి? ఔరా! (ఖడ్గము చేతితో నెత్తి) ఏమి దీనిసాగను! చాలబరువుగానున్నది. ఏమిదీనివాడి. ఆహాహా! ఇది ఎంతకరకుగానున్నదో చూచెదనుగాక (చెంతనున్న వెదురు జొంపమునుజూచి) ఇదుగో యీవెదురు జొంపమును నరికి దీని కరకు జూచెద. (నరకగను వెంటనే అందుజంబుకుమారుని శిరస్సు తెగిపడును, ఆశ్చర్యముతో) ఔరా! ఏమిది? ఖడ్గముబడుటయే వింత యనుకున్న ఇది అంతకన్న వింతగానున్నదే! ఇందు వీడువెట్లుండెనో నాకు తెలియదయ్యె. అయ్యో! ఇతను నిక్కముగా తపసి. శివశివా! ఇదియొక పాపము తటస్థించెను. అయ్యయ్యో! ఈఖడ్గంబేల నాముందుబడినది. నాదారి నేరాక యీవెదురు జొంపము నేలనరకితి. హరిహరీ! ఎంత ఘోరము. ఎంత ఘోరము. అంతు తెలియక ఎంత జేసితిని.

తే. గీ. ఏమిచేయుదు నయ్యయో ♦ యింక నేను
కలుష మొడిగట్టుకొంటి ని ♦ ష్కారణముగ
తపసి యిందుండెనని నే ♦ తలచనైతి
కపటిఖడ్గము చేబట్టి ♦ చపలునైతి॥

ఇతడు వెదురుజొంపమునం దెటులప్రవేశించెనో తెలియకుండె. గతించిన దానికి చింతించిన ప్రయోజనంబేమి? పోయి శీతా రాఘవులకీ వంగతి దెల్పెద. రాముడే దీని సందేహము తీర్చవలెను.

(నిష్క్రమించును)

[ ప్రవేశము — శరభంగుడు ]

సీతారా పుత్రులను గాంచి చాలదినములైనది. నేడు పోయి చూచి! వచ్చెదగాక! వారు పంచవటిని సుఖముగా సంచరింపుచున్నారో లేదో

ఉ. కానకువచ్చె రాఘవుడు ♦ కైకవరంబున కాంత తమ్మునితో
పూనికతోడ పంచవటి ♦ భూస్థలినుండుమటంచు జెప్పితిన్
దానవుడింక ఎన్నటికి ♦ దగ్ధము జేయునో తెలియకుండనే
మానక వానిజంపుటకు ♦ మర్మములన్నియు జెప్పివచ్చెదన్॥

పాపము? అతిసుకుమారి సీత ఎట్లు మసలుచున్నదోగదా! ఆతల్లి కేవలము లోకమాత.

(నిష్క్రమించును)

రాము- కాంతా! ఆవచ్చువాని శరభంగుడనియే తోచుచున్నది. ఎదురుబోయి తోడ్కొనివత్తు నీవిచ్చటనుండుము.

సీత— నాథా! మన లక్ష్మణుడింకను రాడేమి? కారణ మేమియో తెలియరాదాయె.

[ ప్రవేశము— శరభంగుడు ]

రాము- మునికులతిలకా! వందనములు.

సీత— తాపసేంద్రా! నమస్కారములు.

శర— సుఖీభవ సుఖీభవ. సీతారాములారా! మిమ్ముగాంచిచాల దినములైనది. ఇచ్చట సౌఖ్యముగా నుండెనా? లక్ష్మణుడేడీ? ఆతండెందుపోయెను. బహు జాగ్రత్తగా వర్తించుచున్నాడా మీయెడ?

[ ప్రవేశము— లక్ష్మణుడు ]

లక్ష్మ- మునివరా! వందనములు.

శర— సుఖీభవ. దీర్ఘాయుష్మానుస్సు.

రాము- మహాత్మా! శరభంగా? యిటుకూర్చుండుము.

(కూర్చొనుచున్నాడు)

రాము- తమ్ముడా! నేడేమి వదనము మారియున్నది. చింతాక్రాంతుడవైయుంటివేమి?

లక్ష్మ- (విచారముతో) అగ్రజా! ఏమనిదెల్పుదు. కటకటా! అకారణముగ పాపమునకు బాలైతిని. దేవా నేపాపాత్ముండ రామా! యీకలుషాత్ముని మోము మీరుచూడరాదు.

రాము- (ఆశ్చర్యముతో) అనుజా! ఏమట్లు పలుకుచుంటివి. నీనోటి వెంట నెప్పుడిటువంటి మాటలు వినలేదే. సోదరా! ఏల నీసంశయము? నీసంగతి విచారించక దెల్పుము, ఏమి ఖర్మము. పాపమనియెద వేమి?

తే. గీ. పితృమాతృలు ముసిమమ్ము • బిలతువీవు
జీవహింసన నొప్పవు • శత్రువైన
ఆర్తరక్షకుడు లక్ష్మణ • మూర్తియంచు
చెప్పుకొనుచుందు) నీకేమి • చేటువచ్చె॥
సంశయింపక మాదరినీసంగతి నంతయును దెల్పుము.

లక్ష్మ- రామా! సుగుణాభిరామా!

తే॥ గీ॥ యేమిదెల్పెదవినుము • శ్రీరామచంద్ర
పంక్తిగోయుగ గగనంబు • నుండియొక్క
ఆయుధముభూమిపైబడి • నంతనేను
పదునుజూడగ నరకిడి వెదుకు • పోదను॥

అందుయెవనిదో శిరముతెగి రక్తప్రవాహములతో నాముందరపడెను రాఘవాయిదియేసంగతి తప్పుసైరింపుడు. .

రాము- సీతా—హాహా! యెంత ఘోరము.

శర— అయ్యా! విచారింపకుడు. యిదియొక సుభవార్త. దీనిసంగతి దెల్పెదవినుడు.

16 కీర్తన. రూపకం-వసంత

1. వగవనేల రామచంద్రా ♦ జగదుపకారము జేసెను॥ వగ॥
పగతుడతడు మానిగాడు ♦ భయమందగపనిలేదు
మి. రఘురామా యాతండొక ♦ రాక్షసపుత్రుండునుమ్మా
వగగొని యీముల్లోకము ♦ బరిమార్చగ నూహించెను॥ వగ॥

2. రావణునకు మేనల్లుడు ♦ భావమునాతనిజంపగ
కావరమున భానుగూర్చి ♦ ఖడ్గముకై తపము జేసె॥
మి. ధీవినుతుడు సౌమిత్రా ♦ దిక్కునకేగెడివేళలో భూమింబడ
వేశకత్తి పూజ్యుండగు సూర్యుండు॥ వగ॥

3. ఘోరతపము జేయ కత్తి ♦ దూరంబునబడియెనంచు
శూరుండగు రక్కసుండు ♦ సూర్యునిపై కోపించిన
మి. చేరువ మనసౌమిత్రి చేతబట్టి ♦ యూపొదను క్రూరతనరకిన
వానికోపమెల్ల దీరిపోయె॥ వగ॥

4. లక్ష్మణుండు వానిజంపి ♦ రక్షించెను జగమెల్లను
రాక్షసిశూర్పణఖకొడుకు ♦ రామజంబుమాలి పుత్రు
మి. యీక్షణమున మీరిద్దరు ♦ విడిచిపెట్టు డీచింతలు
దీక్షమీకు అనుమజంప ♦ దివ్యజ్ఞానముజూడుడీ॥ వగ॥

పరుల కెగ్గుచేయ దలంచినాడు గాన అతడే చెడిపోయెను. మీరు విచారింప నవసరంలేదు. రామా! యినకులసోమా! సౌమిత్రీ! దీని సంగతియిది. విచారింపకుడు యికనేబోయెద జాగైనది.

సీత— రామ-లక్ష్మణ-చిత్తము.

( శరభంగుడు—నిష్క్రమించును )

[ ప్రవేశము—శూర్పణఖ ]

( పడియున్న కుమారుని శిరస్సుజూచి )

హా! కుమారా! యిదియేమిరా! నాయనా? నిన్నిట్లుచేసిన దురాత్ముడెవడురా! పలుకవేమితండ్రీ?

తే. గీ. కటకటాముద్దు పుత్రున ♦ కారణముగ
శిరముత్రుంచెను యెవనికి ♦ చేటువచ్చె
యెంత ఘోరము జేసెదు ♦ నాత్మకుండు
చేతులెట్లాడెనో నాదు ♦ సుతునిజంప!

నీవి విదురుజొంప ముందుంటివని యెవనికిదెలిసెరా! టక్కరీడు యెక్కడికి బోయెనో? అయ్యయ్యో? యేమినావెర్రి పుత్రుడు గతించె యిచ్చట నాకుసంగతి యెట్లుదెలుసును గావునయిప్పుడేపోయి దీని సంగతి మానులనడిగెద. చెప్పకుండిరేని వారినందర ద్రుంగెద? గతించిన పుత్రుకొరకు చింతించినలాభమేమి? కావున యిప్పుడే పోయెద? ( నిష్క్రమించును )

( శరభంగుడు ఆదారిని పోవుచున్నాడు )

[ ప్రవేశము—శూర్పణఖ ]

(శరభంగునిజూచి) అరే? తాపసాధమా? నిలునిలు యెక్కడికిపోయెదవు! టక్కరీడ? యెంతపనిజేసితివిరా? నీచాత్మా!

17 కళ్యాణి—త్రిశ్రజాతి

1. పారిపోకనిల్వరా ♦ ఛీ క్రూరా? యెటుబోయెదవురా॥ పారి॥
శూరుడని నాకొడుకును ♦ కొంతభయము లేకజంపి
దారినిబోవుటనీకిది తగునా ♦ యిది మేలగునా॥ పారి॥

2. దిక్కులన్ని గెలచినట్టి ♦ మిక్కుటబలశాలి రావ
ణాక్క చెల్లెలని యెరుగక ♦ నిక్కముగా సుతునిజంపి దుఃఖము
నొందగజేసియెక్క డికేగెదనిల్వు ♦ ముక్కలుగాగోతునిన్ను॥ పా॥

3. శూర్పణయని మది నెరుగక • కార్పణ్యము బూనితో రా
నేర్పునకే నేనిన్నుబట్టి • యొరగా భ్రమింగెద నేను॥ పా॥

4. దబ్బరగాడింకను నీయబ్బ * యెవ్వరడ్డము రా తబ్బిబ్బుల
నిన్ను నొక్క దెబ్బతో డగూల నేతు॥ పా॥

5. శరభంగా? కౌతుకపురి చేరియించెడి * వీరాగ్రేసరుడు
నీకడ్డమయిన * ఒక్కముద్దగా భ్రమింగెద॥ పా॥

(దగ్గరకుచేరి శరభంగునిపట్టుకొని)

ఓరీ? తుచ్ఛుడా? నాకొమారుని జంపి యెచ్చటికేగ గలవురా

శర— (తనలో ఆహా! మధ్యదారిలో దీనికి జిక్కితిని ఒక్కక్షణమున్న ఆశ్రమముకు బోవుదునుగదా! యేమో నేనెరుగనన్న నన్ను విడువదు. లేక మాయామానుషులు యెవరీపని జేసితిరని చెప్పిన వారి నందరిని భ్రమింగును కావున రామలక్ష్మణులేమోగాని మేమేమి యెరుగమని దెల్పెద. వారు దీనిపొగరడంచెదరు. (ప్రకాశముగా) తల్లీ? శూర్పణఖా! నేనుగాని మామహానులుంగాని నీకుమారుని జంపలేదు.

తే. గీ. పంచవటియందుండె నిద్దరు * భామతోడ
రామలక్ష్మణునామములు * కోమలాంగి
వారు జేయంగవచ్చుని * కార్యమెల్ల
జనుమునంతియె కాని నే * జంపలేను॥

అమ్మా? నన్ను విడువుము. మామహానులు నీకార్యము జేసిరని యెల్లు నమ్మితివమ్మా.

శూర్ప— శరభంగా? పొమ్ము

[ శరభంగుడు—నిష్క్రమించును ]

శూర్ప— (కోపముతో) ఔరా! రామలక్ష్మణులారా! నాకుమారుని జంపి మీరు బ్రతికెదరా! నాకుమారుడేమి పగజేసెను.

తుచ్ఛులారా? నన్నవ్వతిగా తలంచితిరి? లోకవిద్రావణుని చెల్లెలనియెఱుంగరా! యిదిగో! వచ్చుచున్నాను మీయసు రులదీసి నాకుమారునివధకు శాంతిజేసెద (కేకలు వైచుచు రామ లక్ష్మణుల దరికివచ్చును)

రాము— సీతా! యికవత్సరము గడచినవెంటనే పురికిజేరవచ్చును. సౌఖ్యము లనుభవింపవచ్చు!

సీత— నాథా మీవెంటనున్న నాకు యీవనవాసము వనవాస ములాగువదోచుటలేదు భవనంబులనుండు సౌఖ్యముకన్న యెక్కుడుగనున్నది.

రాము— ప్రాణేశ్వరీ! లక్ష్మణుడేడీ? యెచ్చటనున్నాడతడు జాడలేదే

సీత— మనోవల్లభా యిప్పుడేగదా ఫలములదెచ్చుటకరిగినాడు. మరచితిరా వచ్చుచుండును.

[ శూర్పణఖ—ప్రవేశము ]

శూర్ప— (తనలో) ఆహా! నాకొమారుని జంపినవారు వీరేఅయి వుండవచ్చు, ఔరా! నాకోపమెల్ల మరలినది ఆహా యీపురుషుడెంత సౌందర్యముగానున్నాడు నాకుమారుని జంపినవాడితడే వీనిని యిప్పుడు మ్రింగెదనా లేకవీనితో పొందెదనా అట్లయిన నాకోపమెట్లుతీరును! తప్పక వీనిని జంపెదను (ఆలోచించి) కోపమునకేమిగాని యీతని ప్రక్కజేర్చవలయును. అదియేలెస్స

తే. గీ. యితనిసౌందర్యమెన్ననే * నెంతదాన
మరునిమించెను యందమే * మనగవచ్చు
భువినిగల్గెనె యీతని * బోలువారు
వేయునేలనుయింక నా * విభుడితండె!

శూర్ప- ఈసుందరాకారుని తప్పక పెండ్లాడవలయు మెల్లగా దరికేగి ప
లుకరించెదగాక [ దగ్గరకు చేరి రామునితో ]

ఓయీ! యింతచక్కనివాడవు నీవెవ్వడవు? నీపేరేమి?

రాము- మేము సాకేతపురిరాజగు దశరథుని పుత్రులము నన్ను రామ
చందురు డందురు అక్కడనున్నవాడు లక్ష్మణుడు ఈమె నాభార్య సీత

శూర్ప- రామా! యింక నావృత్తాంతము వినుము.

తే॥ గీ॥ దిక్కులన్నియు క్షణములో ♦ నొక్కడంచు
నట్టి నిశకంఠునకు నేను ♦ యనుగు చెల్లె
పేరు శూర్పణఖందురు ♦ ప్రేమమీర
రామ నాయాజ్ఞ దాటడు ♦ రావణుండు॥

యిదియే నాసంగతి వింటివా?

రాము- నీతో మాకు పనియేమి?

శూర్ప- పనియా? పనియుండుటచేతనే వచ్చితిని

తే॥ గీ॥ నిన్ను పెండ్లాడ దలచినే ♦ నిక్కముగను
వచ్చితిని నన్ను వరియించి దాని ♦ వదలుము
అన్ని సౌఖ్యము లొనగూర్తు ♦ సయ్యనీకు,
ఖరుడు నాయన్న గలడు యీ ♦ కాననమున॥

అతడు రాక్షససేనతో నున్నాడు నన్ను నీవు చేపట్టిన నీకతడు బి[illegible]ముతో
యొసంగును.

ఉ॥ రూపములేని సీతవిడి ♦ రూఢిగనన్ వరియింతువేని యీ
దాపున నాదుసోదరులు ♦ దైత్యులగొల్లను వీరులుండిరి నీ
యాపదలన్ని దీర్పఁగల ♦ యాసతి నిప్పుడు మ్రింగివేతు రా
పాపము వెట్టిదా డపక ♦ వెక్కను కేరుము నీకు మేలగున్॥

ఈమెని నెదుటనే జంపెదను దీనిరక్తము ద్రావెదను మన సౌఖ్యములకున

నీవునునావలె దాసివయ్యెదవు మాయిన్నికడకేపొమ్ము నిన్నగడేహించ
గలదు శూర్పణఖా? నమ్మునా మాట.

శూర్ప- ఔను లక్ష్మణుడు చెప్పినదే సత్యమనిదోచుచున్నది. రాముడే
పెండ్లాడవలయు [ రామునిదరికేగును ]

రాము- శూర్పణఖా? మరలవచ్చితివేల?

శూర్ప- అయ్యో? లక్ష్మణుడేమి? నేనేడ? నీవే నాకువరుడవని నమ్మితి.
రమ్ము జాగుచేయకు మన్మథుని బాధసహింపజాలకున్నాను.

తే॥ గీ॥ జాలమేలనురమ్ము యో ♦ నీలవర్ణ
అల్లదే? జూడుపొదరిల్లు ♦ యతివవిడచి
గమ్మునను గూడనీవు ని ♦ రంతరంబు
సౌఖ్యము గూర్చి నన్నేలు ♦ నన్ను తాంగ!
రమ్ము ఆలసించకు

సీత- ( తనలో ) సిగ్గువిడచియము విసర్జించి యెట్లుపిలుచున్నదో?
[ అనినవ్వును ]

శూర్ప- యేమీ? నన్నుజూచినవ్వెదవా నిన్నిప్పుడేమిచేయుదునో
చూడుము నన్నవ్వతిగాతలంచితివి గయ్యాళి? యెట్లున్న
దానవె కురూపి?

తే॥ గీ॥ యేలననుజూచి నవ్వెదవె ♦ యింతినీవు
అందగత్తెవనాకంటె ♦ అసురలేక
నిన్నుమింగెదవిడువను ♦ నిక్కముగను
రాముపతినేనె యింకయో ♦ రంకులాడి!

యిదిగో యేమిచేయుదునో చూడుము [ అని మీదికిదుముకును ]

రాము- ఆ? శూర్పణఖా? చాలు? చాలునమ్మా? యిదియా నీవర్తనము
తెలిసినది [ భయపడుచున్న సీతను, రాక్షసిబారి చేతను బట్టు

కొని లక్ష్మణుని పిలచి ]

లక్ష్మణా! యికనవ్వులాటకూడదు దీనిని కురూపిం జేసిపంపుము యిది యేనాయాజ్ఞ!

లక్ష్మ- యేమే? రక్కసి? తుదకుయిదియా పని? నిన్నుపూరకవిడచు వాడను కాను.

తే॥ గీ॥ ఓసిరక్కసి యింకనే ♦ వదలనిన్ను
కర్ణములు, ముక్కుగోసెద ♦ కరుణవిడచి
దిక్కుగల్గిన చెప్పుకో ♦ నిక్కముగను
శిక్ష నీకిదె రాక్షసి ♦ చేరుమిల్లు॥

[ సీతారాములు చూచుండగనే ముక్కు, చెవులు కోసెను ]

శూర్ప- రామా! యిది యేనా నీ నీతి! యింతి యేనా ధర్మము! చవటలారా! మిమ్మేమిచేయుంచెదనో చూడుడు? మీప్రాణములుదీయి చెద యెంతపనిచేసితివిరా? లక్ష్మణా! క్రూరుడా! యేమిరా! నీ సాహసము.

తే॥ గీ॥ కష్టములు బెట్టి మిమ్ముయా ♦ కానసమున
గాకనిమీకు దూరంబు ♦ జేయకున్న
తప్పకుండను నా పేరు ♦ చుప్పనాతి
కాదు నా పేరు భగవంతు ♦ పాదనా॥

లక్ష్మ- పొమ్మునీదిక్కున్నచోట చెప్పుకొమ్ము ( సీతారామలక్ష్మణులు
[ నిష్క్రమింతురు ]

శూర్ప- అయ్యో! నేడెంతగతిగల్గె.

తే॥ గీ॥ కర్ణములు ముక్కు బోయెనా ♦ ఖర్మవశము
స్త్రీలలో నెట్లు తిరుగ లేదు ♦ సిగ్గుగాదె
అదియుబోయెను యిదిబోయె ♦ అందమెల్ల
బాసిపోయెను యింకేమి ♦ జేసుదాన॥

యిప్పుడేమిచేయుటకు నావల్లగాదు. పోయి మాయన్న రావణా సురానితో జెప్పుకుందుముగాక.

(నిష్క్రమించుచును)

(ప్రవేశము. రావణ ధూమ్రమాక్షులు)

[రావణుని సభాస్థానము]

రావ— రాక్షసవీరులారా! ముల్లోకములను జయించితి. కోరిన కాంతలను బెండ్లాడితి. సురలచే దాసత్వము జేయించు చున్నానుగదా? పదునాల్గు భువనంబుల పేరుగాంచితి. మొన్న గంధర్వకాంతను గొనివచ్చితిని జూచితిరా! ఏమి? దానిసౌందర్యము! ఔరా! గంధర్వు లెంతపిరికి వారో! ఒక్కడైనను నోరెత్తలేదుగదా! నాకు వంగి సలాములు జేసిరిగాని కిక్కురుమనలేదు.

చ॥ గెలచితిమూడులోకముల * కేనుప్రభుండని అష్టదిక్పతుల్ గొలతురువెల్లకాలమును ♦ కోర్కెలతీర్చగి నాదుదాసులై నిలతురు నన్నుజూడగనె ♦ నిర్జరమానులు ఆజ్ఞబద్ధులై దలచిన మూడులోకములు ♦ దగ్ధముజేతుననూరులార నే॥

ధూమ్రమా—మహారాజా! త్రిమూర్తులైనను మీమాటకు బద్ధులై యుండవలసినదే! సురాసురులకజేయుడవగునీకు యీభువనంబుల ఎదురుండునా!

రావ— నిజము. నిజము ధూమ్రమాక్షా! నిజము.

[ప్రవేశము—శూర్పణఖ]

శూర్ప— అన్నా! నీచెల్లెలిగతిజూచితివా! లోకములనెల్ల జయించి లోకకంఠకుడని పేరుగన్న రావణుని చెల్లెలికింతగతి వచ్చెనో! అన్నా! అన్నా! అన్నా! బ్రతుకజాలరక్షింపుము రక్షింపుము (కాళ్ళపైబడును)

రావ— చెల్లెలా. ఏమి? నీకు ముక్కు చెవులు పోవుటకు కారణ మేమి. ఎవడాతుచ్ఛుడు. నిన్ను బాధించినవాని యును రుల తత్క్షణమే దీసెద చెప్పుము.

శూర్ప— రాచకుమారులట! పంచవటిని ఉన్నారు.

రావ. తే గీ. ఔర నరులార సోదరి ♦ ముక్కుచెవులు
గోయ మీచేతులెట్లాడె ♦ క్రొవ్వడంతు
పంక్తికంఠుండందు నా ♦ ప్రజ్ఞగనక
మోసపోతిరి కాల ♦ మాసన్నమయ్యె!

రావ— చెల్లీ! నిన్ను యీలీల బాధించిన కలుషాత్ములెవ్వరో దాచక నీసంశయసంశయు దెల్పుము నీపగదీర్చెద.

శూర్ప— అన్నా! యిటువినుము.

18 ఫీల్వా—ఏక తాళము

1. ముక్కుజూడుమన్న ♦ నేమొక్కెదవిను పెద్దన్నా॥ ము॥
అక్కటకట నన్ను చాల ♦ యిక్కట్టులపాల జేసె బక్క
నగలు యుద్దరుండె ♦ భామతోడగూడికోసి॥ ము॥

2. దశదిక్కులయందునీదు ♦ యశమునిండియుండెనన్న
అనమానపుశౌర్యరాశి ♦ వనిమెంచకయిటుల జేసెను॥ ము॥

రావ— ఔరా! క్రూరులార! ఆడుదియా ముక్కుచెవులు గోయుటకు.

3. గుండెబెదురు లేకనరులు ♦ మెండుకెక్కె పంచవటిని
యుండెనయ్యెకాపురము ♦ అండజాక్షితోడగూడి॥ ము॥

4. సురలమునుల క్షోమునంట ♦ ననుగాలబరిమార్చునంట
దశరథునకుపుత్రులంట ♦ దైవంబులెవారంట॥ ము॥

రావ— ఏమి! ఆ! అనుకుల యునుకులదీసి, మానులరక్షించునా! పశు ప్రాయులార! మీపవన యీలంకేశ్వరుడు చూడకవిడనునే!

5. పింతలుగుల్కెడునరుల ♦ చెంత కేగి నేనెంతో సంతస
మునజూచుచుండ ♦ సఖయారమ్మనిబిలచిరి॥ ము॥

6. పణాతీరమ్మనిబిలచిన ♦ భయముననేవచ్చుచుండ కను
గొనినన్నొకడుబట్టి ♦ కర్తంబులుముక్కుగోసె॥ ము॥

6. ముక్కుమాటకేమిగాని ♦ చక్కనిచిన్నదిగలదు
లెక్కించగదానందము ♦ ముక్కంటికితరమా నా
ప్రక్కనుజేర్చగనీకు ♦ భ్రమగలైనుఅన్న నాకు నిక్కం
బుగదానిదెచ్చి ♦ నీసతిగాజేసుకొన్న చక్కదనంబేమం
దును జనుపెద్దన్నా! రావణా! ము॥

రావ— చెల్లీ! అదిఅంతసుందరియా! తప్పకదానిదెచ్చెద చింతిం
పకు వాడిక దే! శిక్ష

8. భూతలమునపసిడిబోలి ✳ ఖ్యాతినొందియాలంకకు
రత్నంబునుబోలుసీత ✳ నాతినిసమకూర్చితివా పసిడి
కిపరిమళమబ్బిన ✳ దశనుండదెమనలంక ఏతీరు
నకౌతుకపురి ✳ తేతలపిడ్డవరదు కాంతనీవుదెచ్చె
దవో ✳ కనుగొనిమొద దశకంఠా॥ ము॥

రావ— శూర్పణఖా! పంచవటినున్నదాకాంత! ఆ! నీవు పొమ్ము!
నిన్ను భంగపుచ్చినదానికి ప్రతిఫలం సీతను లంకాపురికి
తీసుకొచ్చెద పొమ్ము.

శూర్ప— అన్నా! ఆకాంతను నీవుపెండ్లాడిన మనలంకాపురికి క్రొత్త
అందమువచ్చును. కావున పోయిన నాముక్కుచెవులు
యికరావు! నీవు తక్షణమేపోయి సీతనుతప్పక తేవలెను
సుమా!

రావ— చెల్లీ! ఏమినీయనుమానము

19 బెహాగ్ — ఏకతాళము

1. నీయానదాటుదునా * యీమాననిదేకుందునా। నీ॥
దానవులకుమేటినయ్యు * దశశిరుడనిఖ్యాతినొంది మా
నవకన్యనుదేవగ మన * గొకలెక్కాచెల్లీ। నీ॥
2. ముజ్జగములనన్నుమించు * ప్రజ్ఞవంతుడైనవాడు క
ర్జంబుననన్నుగెల్వ * గలరేనిర్జరులైన। యీ॥
3. ముల్లోకములొక్కసారి * ఘూర్ణిల్లనపై బడినగాని వెల్లు
వద్రుంచకవిడుతునె * ప్రళయకాలరుద్రుభంగి। నీ॥
4. నాశత్రులరక్షింపుచు * వాసముజేయుచునిందు యీ
శుద్ధైన నిల్వగలడె * యింతితో మనపంచవటిని। నీ॥
5. గంగాధరుడేవచ్చి * భంగపుచ్చినన్‌గాని క్రుంగద్రొక్క
యీనాతిని * గొనిరాడే రావణుండు। నీ॥
6. వాసిగవీర్రెడ్డిసాను * వరదునిసతితేకున్న యోచెల్లీ?
వినుమిక నీయన్నరావణుండగాను॥ నీ॥

శూర్ప— అన్నా మరచిపోకుము. బహుజాగ్రత్తగా వెళ్ళుము. నేను పోయెదను.

(నిష్క్రమించును)

రావ— ధూమ్రాక్షా నీవు తక్షణమేపోయి మారీచునింటికేగి యీసంగతిఅంతయు తెల్పక వేగముగా తోడ్కొనిరమ్మని నాయాజ్ఞగా దెల్పి శీఘ్రముగా పోయిరమ్ము.

ధూమ్రా— మహారాజా చిత్తము.

(ధూమ్రాక్షుడు నిష్క్రమించును)

రావ— (ఆలోచనతో) ఆహా కాంతనుతోడ్కొనిరానా లేక రామలక్ష్మణుల సీతతో నహితము వధించిరానా కాదు కాదు. ఆసీతనుతోడ్కొనివచ్చి తప్పక పెండ్లాడవలయు.

: (ప్రవేశము—ధూమ్రాక్షుడు మారీచుతో )

మా— ఏమి? రావణా? సుఖముగానున్నావా! నాకు కబురుపంపిన కారణంబేమి, త్వరగాదెల్పుము.

రావ— మారీచా! వచ్చితివా! తెల్పెదవినుము.

తే. గీ. వినుముదెల్పెదసంగతి ♦ మేనమామ!
నాదుసోదరికర్ణ నాశి ♦ కముగోసి
ఖరునిదూషణుబరిమార్చి ♦ కాల్బలంబు
అంతమొందించి ♦ ననుచాల చింతముంచె॥

20 బెహాగ్—ఏకతాళము

1. మామా! మారీచనేనేమని దెల్పెదసంగతి॥ మా॥
పామరులిద్దరునరులు ♦ పంచవటినియున్నవారు కామం
బుననాదుచెల్లె ♦ గలియగనూహించినారు తామనమున దా
నిబట్టి ♦ తరిగెనంట ముక్కుచెవులు॥ మా॥
2. చక్కనైనచిన్నదొకతె ♦ ప్రక్కనుండెనొక్కనికి
మక్కువతో దానిగలియ ♦ మనసుబుట్టెనాకు నిక్కంబుగ
నీవుపోయి చక్కని హరిరూపుదాల్చి ♦ టక్కరిమాయ
లముంచియు ♦ చిక్కులబత్రోసిదాని నొక్కతెనిడ
దీయుమయ్య ♦ ముక్కుతనోమామయ్యా॥ మామా॥
3. క్రూరాత్ములవిడదీయగ ♦ జేరుమయా పంచవటికి ధా
టుణితో కౌతుకపురి ♦ ధాముదుపీర్రెడ్డిదాన వరదుని
మాయులద్రోచిన ♦ వనితనునే దెచ్చెద॥ మా॥

వ. కావున నీవు తక్షణమేపోయి శామలక్ష్మణుల వంచించవలెను.
- నీవు లేడిరూపముదాల్చి పొమ్ము. నిన్నుజూచి సీత భ్రమయును భ్రమసి రాముని వెంటబంపును. అప్పుడు నేను భిక్షుకరూపము దాల్చి సితనులంకకుదెచ్చెద.

మారీ— రావణా! రాముడెవ్వడనుకొంటివి! వెర్రివాడ.

తే. గీ. మున్ను దెబ్బతింటి ♦ వినుము రామన్న బలము
దైవయోగంబుచే దెబ్బ ♦ తప్పిపోయె
బ్రతికియున్నాడ నింకను ♦ పంక్తికంఠ
పన్నుగా బాహుబలమున ♦ ప్రభువతండు॥

లంకేశ్వరా! కేవలము అవతారపురుషుడు. కాని సామాన్యమను డుకాడు. రావణా! యిది పరమరహస్యము నీతో జెప్పుచున్నాను. అతడు మనవంటి దుష్టుల సంహారింపనెంచి యిట్లు భూమియందు బుట్టెను. మన తాటక సుబాహులను ఒక్క లిప్తలో సంహారించినాడు. నేనట్లెట్లో తప్పించుకొని బ్రతికితి. కావున మరేదిచెప్పినను చేయుదును. అంతియేకాని యిక్కార్యము నేను చేయలేను. నన్ను క్షమింపుము.

రావ— ఓరీ! తుచ్ఛుడా! ఏమంటివి రాముడు భగవంతుడా! వెర్రివాడా! అయిన ఏమిచేయును మనలనతడు.

మారీ— ఏమిచేయునా!

తే. గీ. ఒక్కశరమున ఖరుని ♦ నుక్కడంచె
పిచ్చియూహానుమానాను ♦ నీబ్రతుకు కనిశ్చయంబు
అనుభవించితిమున్ను నే ♦ నతనిదెబ్బ
వద్దు రావణా నేజెప్పు ♦ బుద్ధివినుము॥

రావ— ఓరీ! కలుషాత్మ! నాయాజ్ఞ మీరితివిగా! నన్ను ఎదిరించి బ్రతికెదవా! ధూమ్రాక్షా! ఖడ్గమేదీ! తుచ్ఛునిమచ్చ మాపెదను. మారీచ.

తే. గీ. పిచ్చితలపులనీడుమో ♦ పిరికిబంట
పరుగు నేగుము లేడివై ♦ పంచవటికి
అడ్డుజెప్పితివేని నా ♦ ఖడ్గధార
కెరను జేసెద మారీచ * నీశిరంబు॥

మారీ— (తనలో) పోవకుండిన వీడు చంపును వీనిచేతిలో జచ్చిన ఘోరవాదినరకము నంబడుదు ఆశ్రీరామచంద్రుని చేతిలో జచ్చిన స్వర్గపురికి త్వరగా బోవగలను. ముక్కు మూసి కొని నేననేకాళ్ళు తపమునల్పిన ఆ శ్రీహరింగనుగొనజాల ఇదియునా మేలునకే (ప్రకాశముగా) రావణా! అట్లే పోయెద. నీమాన దాటుదునా!

మారీ— అనుమానముగా పల్కుచున్నావు నీవు నేను చెప్పినట్లు చేయుదువని తోచదు. నీవు పోయి లేడివై రామలక్ష్మ ణులు నీవెంటవచ్చునట్లు జేయుము. యిక సీత ఒంటరిగా నాకుజిక్కును. అట్లు జేయుదువా! లేదా! నిక్కముపల్కు మారీచ.

మారీ— అల్లుడా! నేకల్లబొల్లి మాటలాడుదునా! యికనీకోర్కె చెల్లించెద? ఇకనీవుబోయి నీప్రయత్నము జూచుకొనుము.

రావ— సెబాస్! మామా! నిన్నుబోలు మిత్రులునాకెవ్వరు లేరు. ప్రతినచెల్లింప నీకేతగును. బలే పోయిగమ్మునసేకోకించి తినని నీమనస్సున యుంచుకొనకుముసుమా! తప్పక జేయువలయును. నేబోవుచుంటిని.

మారీ— త్వరగా జనుము. నేనిప్పుడే పంచవటికేగెదను.

(రావణుడు నిష్క్రమించును)

శ్రీరామచంద్రా మీజోడెడుబాపితినని నాపై నలుగకుము రామా! జగదాభిరామా? నేజేయునది నీకపకారంబైనను ముందునీకు పకారమే! నీవు వచ్చి యీభూమియందు జన్మించినపని నాకారణము చేనులభముగా నెరవేర్చుకొనవచ్చు నేనిదే వచ్చుచుంటి.

(మారీచుడు మనుష్యాకారముమారి బంగారు లేడియై పంచవటికేగును)

సీత— (సారంగమునుజూచి) నాథా! అటుజూడుము. హాయిహాయి

ఏమిదానిసొగసు. అల్లదే! ఆ పొదపై మేయుచున్నది.

తే. గీ. మెరుగుబంగరుచాయతో * మేనుగల్గి
దిరుగుచుండెను ప్రాణేశ * హరిణమదిగొ
పట్టుకొని తెండు దానిపై * భ్రాంతిదోచె
గంతులిడుచుండె మన * చెంత సంతసమున॥

రాము— కాంతా! అది మాయగాని లేడిగాదు. ఇదివరకు ఇట్టి కురంగముజూచి యుంటిమా!

తే. గీ. లేడిగాదిది దైత్యుల * ప్రోఢగాని
కంటివే యెప్పుడైన నీ * కాననమున
హేమరేకలుగల్గుట * కోమలాంగి
మాయజిక్కకనమ్మమో * తోయజాక్షి॥

కావున నీవు దానిపై భ్రాంతినొందకు.

సీత— నాథా! నాముద్దు చెల్లింపరా! నాపైమీకు కోపమా!

20 ఝంఝూటి—ఏకతాళము—దైలాగు

సీత— ఆరగుచుండెనాథ * పసిడిరిణి దేవ నాపై వాద॥ అర॥
యిగ్రినిగనినంతనె నావెర్రిమనసు దానిపైని * చగ్రుమంచు
బరతెంచెను జనుమా * నామనవినుమా॥ అర॥

రాము— అతివకొయ్యాలేడి * నేనరగితెచ్చుకోర్కెవీడు॥ అతి॥
యింతియాతొంతరేల * చెంతనున్నదల్లదిగొ గంతులిడు
చుతునచెంతకె * గరికెమేయవచ్చుచుండె॥ అతి॥

సీత— పోవుచుండెనాథ * పొదరిండ్లదాటుచుండె నదిగొ॥ పో॥
నీవుపోయిదానినిపుడు * నిక్కముగా బట్టవలయు
భావమునయిటుసంశయింప సారి * పోవుదూరముగా॥ పో॥

రాము— యిందువదనా * మనమున సందేహము దోచుచుండె
సుందరాంగి యిట్టివింతజూచితిమా * వినియుంటిమ
వద్దు వద్దు సీత నాబుద్ధివినుమ భూజాత॥ యిం॥

సీత— అయ్యయ్యో! జీవితేశ ♦ నీతో యెట్లికం కేమి తాళి ।అ।
వయ్యారంబున నడచెను ♦ వయలు జూడ మనసు జెందగ
మారీ యిక యున్న ♦ నా కెవ్వరు యిట్టి కోర్కెలను దీర్తురు ।అ।

రాము— కోర్కె మాను కాంతా! ♦ వెర్రిభ్రాంతి యేల నా చెంత ।కో।
మూర్ఖురాల యీ జగమున ♦ ముద్దులగు టెక్కడి లేడి
రాక్షసమాయలు గాని ♦ మెచ్చకుండవే హేమజాంక ।కో।

సీత— ముద్దుదీర్పు నాథ ♦ మీ యక్కరాంగితో ముకవాద ।ము।
యిదరన్న దమ్ములుండి ♦ యిరిని జట్టగ లేరు
యీ ధరవీరోద్దిదాన ♦ వినుతా! పావన చరితా!
ముద్దుజింక తేకున్న ♦ మరవారిని వెట్లవుదువు ।ము।

నాథా! నా కోర్కె చెల్లింపరా యిదిన్యాయమేనా!

రాము— చింతదక్క నంతోషింపుము ఆవనిడిరిని నీకోరికప్రకారము ప్రాణముతో బట్టితెత్తు (లక్ష్మణునిజూచి) లక్ష్మణా! మీవది నాకోర్కెప్రకారము ఆ లేడినిపట్టితెచ్చెద నీవిచ్చటనుండుము

(21) బేహాగ్ — ఏకతాళము.

1. అనుజాయిటు రమ్ము ♦ నాథను వును చేతికి నిమ్ము ।అ।
జననులేడిని దెచ్చి ♦ జానికి కోర్కె నుదీర్చెద ।అ।

2. పనియీ వదలి యునీవు ♦ భద్రముతో యిటునుండుము
వనదైత్యుల మాయలను మి ♦ వనితనుగా పాడుచుండు ।అ।

3. యిద్ధరసుతగా వుము ♦ శ్రద్ధచేయు మోసమౌను
యిద్దరము చెంతనుండ ♦ పరాధునగాని పోయెను ।అ।

4. పారిపోవుచుండె ♦ యిప్పుడె పట్టి తెచ్చెదను లేడిని
వీర రెడ్డివరదుసాక్షి ♦ విడువకుమా యీ సీతను [అనుజా]

లక్ష్మ— అన్నా! ఏమినీ వెర్రి నిక్కముగ లేడియని యే తలంచితివా!

తే। గీ। లక్ష్మణా వినుమీయన్న • కీర్తనంబు
అప్పుడైనట్టి మీయన్న • ఆర్తరవము
వినగవచ్చెను అయ్యయ్యో • వేగజనుము
రేలకాలీలజాలము | మేలనీకు।

లక్ష్మ— తల్లీ! వెరువకు మాయన్నకేమియుభయములేదు మాయన్న అవతారపురుషుడని ఎరుగవా! తల్లీ! నీమనమున చింతింపకుము.

తే। గీ। దనుజులను గూల్పనెంచియో। యినకులమున
జనన మొందెను శ్రీపతి। జానకమ్మ
వెరుదలపకుమమ్మ నీ। విభుడు గాడు
నేడవచ్చునుపతికే। యిక్కీడురాదు

సీత— లక్ష్మణా!

—: డైలాగు :—

(24) ఫీలూ—ఏకతాళము

సీత— 1. స్వామిన్ లక్ష్మణా! నే। నమ్మజాలనీవల్కులు। స్వా।
సొమ్మసిల్లిమాయన్న। సౌమిత్రీయనిబిలచెను
తమ్ముడవై యుండి। రాముదైత్యులకర్పించగదగున। స్వా।

లక్ష్మ— 2. జననీవినుమా నే। జనగూడదు నిను విడచి। జ।
దనుజులమాయలజిక్కడు। దైత్యాంతకుడగు రాముడు
అనుమానింపకు నీవు। అతడేను భగవంతుడు। జ।

సీత— 3. తప్పక మీయన్నకేదో। గొప్పకు విపత్తుగల్గె
ముప్పారుగక బొమ్మంటిని। మానమువాటిల్లెనకట
యిప్పగదని వేడుచున్న। చప్పునజన వేమిమరదీ। స్వా।

లక్ష్మ— 4. రక్కసుడెవ్వడో మనలను। చిక్కులబెట్టగనెంచి
[illegible]। నిక్కము గాదమ్మయిది

సీత– తే. గీ. బాగుచేయకలక్ష్మణా • నేగజనుము
అన్నయుడవినిమ్మతినొంద • నన్నుకూడ
తలచిరాదవేనాపాలి • దైత్యువయ్యు
నుంటివింనీకుదక్కునా • యుంటకుందు।

లక్ష్మ– తల్లీ! ఏలయీవాలిలదుర్భాషలాడెదవు నీయెడనేనట్టిభావముగల వాడననీవెఱుంగవా జగమెఱుగదా!

తే. గీ. తల్లివేనీవునాకు రాముని • ల్లాలవినుము
చల్లగావచ్చువర్ణకాలకు • శ్రీరామచంద్రు
డమ్మనీకెభయమేల • యిమ్మహీనతండు
జన్మమొందినశ్రీవిష్ణువు • జానకమ్మ।

సీత– లక్ష్మణా! మమ్మురక్షించెదువాడవని నమ్మికొన్నందుకు తగుణమే జూపితివి నీప్రేమ! కత్సితమనసా!

తే. గీ. అన్నబాములుబడినను • నన్నువిడచి
పోవకుంటివిపాపుడ • యిపుడునీవు
తెలిసెలక్ష్మణ నీయూహ • తేటగాను
హంతకాపొమ్మువీయన్న • చెంతకిపుడు।

కలుషాత్ముడ విషముగ్రోలి ప్రాణములైనవిడతుగాని నీకుదక్కను.

లక్ష్మ– [ పాదములబడి ] జానకమ్మా! నన్నేలనిందించెదవు మాయనన్న భగవంతుడు పరులకులొంగుటమున్న గాని నిక్కమౌనా! నేడు పుడుబోయిరిగా! అన్నయానమీరినవాడనౌదు కానిమ్ము ఏది యెట్లయినను నీకోర్కెప్రకారముబోయెదను యిదిగో పోవుచుంటిని నీవీపర్ణశాలవిడచి బయటికిరాకుము తేనిదేబోవుచుంటిని జాగ్రత్త! ఓనీలకంఠా! నీవైననుజానకిని రక్షింపుము యీయమ్మనన్నాకారణముగ దూషించుచుండెను.

తే. గీ. పంచభూతములార యీ ♦ పరమసాక్షి
నిందుదయతోడ్ద బ్రోవుడీ ♦ నిక్కముగను
పోవుచుంటిని నేనిపుడు ♦ పొలతివిడచి
రమణిబ్రోవగ రండు మీ ♦ రమరులార!

ఓ వేల్పులార! సురలార! సిద్ధులార! ఋత్వులార! అత్త్రశరుగుచున్నాను పృథ్వీసుతను రక్షింపభారముమీయదే! రండు రండు జానకమ్మా పో...వు...చున్నాను జాగ్రత్త [ నిష్క్రమించును ]

[ ప్రవేశము రాముడు ]

హా రా! కురంగముదొరకని హేతువచే హతమొనరించితినే ఇపుడు పంచవటికేగినతోడనే అంచయాన నంతోషముతో వసిరిప్రశ్నించిన న్ను ప్రేమతో అడుగును అయ్యయ్యో! నిష్కారణముగ జంపితినే! దానిమాటకేమిగాని యది ప్రాణము విడచునపుడు మొఱ్ఱో లక్ష్మణా! యనియఱచినది యిక జరిగినదానికి వగచిన ప్రయోజనంబేమి త్వరగాబోవలయు [ ముందుకువచ్చి ] అదుగో లక్ష్మణుడిటు వచ్చుచున్నాడేమి కారణమోగదా అయ్యయ్యో మోసముజరిగినది సీతనొంటరిగావిడచి వచ్చుచున్నాడు.

లక్ష్మ- [ ప్రవేశించి ] అగ్రజా! వందనములు కురంగమేది ఏమిచేసినావు దొరకలేదా!

రాము- తమ్ముడా! దానిమాటకేమిగాని

— : డై లా గు : —

(25) జంగ్లా—ఆటతాళము

రాము- హా రాభూపుత్రి విడనాడనీకు ♦ మేలాసౌమిత్రి | హా |
నారివిడువవటంచు నిన్ను ♦ నమ్మివచ్చితిగాసియిట్టి
కూరుడావని దెలసియుంటె ♦ సారసాక్షినివిడచిపోదున | హా |

లక్ష్మ- అన్నా శ్రీరామా నావల్ల ♦ నమ్మమిన కలదె మా | అ |

కన్నదైన నీదుయాజ్ఞకు ♦ రుదురుమాటలాడితినా
నన్నుబంపెనుదానికమ్మా ♦ నమ్మమా నిందించబోకుమా ।అ।

రాము- లక్ష్మణానేమాదక్షిణనేత్ర ♦ మదరుచుండెను ।అ।
యామ్యణంబున కుడిభుజంబు ♦ విరిగినటులుపుదిదో చెనాకు
రాక్షసులచేచంచలాక్షికి * వచ్చునేమాయాపదాలు ।అ।

లక్ష్మ- దేవాది దేవా వందనమిదె । దివ్యప్రభావా ।దే।
సమధానముచేత జెప్పితి । వదినతోక మహిమలన్నియు
చెవినిబెట్టకనీవెమాకు । శత్రుడావనితిట్టినన్ను ।దేవా।

రాము- చింతకల్గెనూ సౌమిత్రినాదు । స్వాంతమునను ।చిం।
అంతరంగమునందుగుండె । లదరుచుండెనేమొకాని
కాంతకేగతిసంభవించెనో । కాళ్లుతడబడుచుండెనాకు ।చిం।

లక్ష్మ- సీతాకళాత్రా! వీరాగ్రణి । స్తోత్రా కౌసల్యపుత్రా ।సీ।
ఘాతకుండవ్వనివటంచును । కర్ణశూలములబోలుపల్కులు
మాటతిట్టభరింపజాలక । మరుగజొచ్చితికరుణజూడుము ।సీ।

అగ్రజా! మీయార్తధ్వనివినినంతనె నేనెంతబోధించినవినక సీతాంబపల్కి-
నపల్కులు మీదెసచెప్పనోయరాకున్నది

రాము- తమ్ముడా! ఆర్తధ్వనియా కురంగమే మిమిక్కేసినదా! ఆయడవియంద
తిరిగినది ఎంతపరువిడినదో యొకదయ్యె అప్పుడునేనుకోపముచే
భాణమువదలితిని దెబ్బతోనే అదియేమిమాయయోగాని హా లక్ష్మ
ణా! సీతా! యనిభూమిపైబ్రాలినది

లక్ష్మ- అగ్రజా కేవలము ఎవ్వడో రాక్షసుడుచేసినపని అంతియేకాని
మరొక్కవిధముకాదు పోనిలే వానిపనిఅయినదిగదా

రాము- తమ్ముడా అయ్యో మనమిక త్వరగాబోవలయును సీతవంటరి
గానున్నది భయపడును తమ్ముడా శీఘ్రముగాబోవుదము

— [ నిష్క్రమింతురు ]

(సన్యాసివేషముతో రావణుడు ప్రవేశము)

ఆహా! పర్ణశాలయొద్ద సీత ఒంటరిగానున్నది. నాకిప్పుడు తప్పక జిక్కును. బళే! మారీచా! నీశక్తికిమెచ్చితిరా! రామలక్ష్మణులు నీవెంట వచ్చుటకు మంచియుక్తిపన్నితివి. సెబాస్ బహుసంతోషమాయెను. హా! సీతా! హా! లక్ష్మణా! యని ఎంత యుక్తిగానరచితివిరా! ఓహో! మరచితిని క్షణకాలవ్యయము జేసితినేని రామలక్ష్మణులు వచ్చెదరు. కావున నేనీ వేషముతో పోయి

తే॥ గీ॥ సాధురూపంబుచేపర్ణ • శాలకడకు
బోయిబిక్షంబడిగిసే • మాయజేసి
భంగపుచ్చెదనామాయ • బడకయున్న
బలిమినైనను గొనిపోదు • భామనిపుడు॥

యిట్లు జాగుచేయకూడదు త్వరితమేపోవుదును ముందుగానే బిక్ష? బిక్ష? బిక్ష? మిముల క్షీ? క్షుధార్తుడనహింపజాలనని సవినయముగా బల్కెద

(నిష్క్రమించును)

[ ప్రవేశము సీత ]

అయ్యో! యింకనురారేమి! ప్రాణేశ్వరునకు లక్ష్మణుడు కనిపించెనో లేదో! అయ్యయ్యో! యెట్టియిక్కట్లు ప్రాప్తిరోగదా! మరది! మగడు! సౌమిత్రీ! మీరున్నచోటికలేదా! అయ్యయ్యో! అడవియందుననీవేమొకినో లేక మీరున్నయునీపును ఏదురాత్ముని చేతిలోనైననుజిక్కితిరో! నాథా! నాథా! నాథా! దినారిబ్రతుకేమగావలయు అయ్యయ్యో! భయముగుచుండెను. యిచ్చోటమనువ్యన చారమైననులేదే! అహాహా! కురంగమొంతగతిదెచ్చెను.

—: పంచపాది :—

సీ॥ స్వామిలేకికిబోయిన • ప్రాణనాథు

జెముకబోయిన సౌమిత్రి ♦ ఎవరులేరు
ఎందుబోయిరో మనసులో ♦ గుందుచుండె
ఏల పొమ్మంటినక్కటా ♦ యిరివెంట
కటకటా! కాలమువరీతి ♦ గతినిమీరె।

మనసుతబ్బిబ్బులగుచుండె నాథా! దబ్బున రారా

[ ప్రవేశము రావణుడు ]

హే! పరమేశ్వరా! కైలాసవాసా! లోకరక్షకా! ఆపద్బాంధవా!

సీత— అదిగో! ఎవరో మహానుభావుడు సన్యాసియిటువచ్చుచున్నాడు యీపుణ్యాత్మునకు నాప్రాణనాధుడు కనుపించెనేమో! నా మరదిజాడైన తెలియునేమో

రావ— (సమీపించి) అహా! ఏమిదీనిహొయలు జారా! సౌందర్యమెంతనివర్ణింతు " భళి భళి ముల్లోకములవెదకినను దీనిసాటి కాంతలుకానుపించరు " బలే! బలే! దగ్గరకుబోయి నానిజస్వరూపముజూపి నన్నుబెళ్లాడుమనిభ్రమపెట్టెదను లేకజతుజేసి తోడ్కొనిపోగును కాదు కాదు యీసన్యాసివేషములో సార సాక్షినిభంగవుచ్చెద? పోయెద జేరా

తే. గీ. నిక్కముగరతిసమించెను ♦ చక్కదనము
గబ్బిగుబ్బలగసతి ♦ బిబ్బిబ్బలయ్యెమనసు
మచ్చికన్ జేసుకొనిపోదు ♦ నిశ్చయముగ
అహాహా? దీనివర్ణింపనలవి ♦ యగునె।

(దగ్గరకుచేరును)

సీత— ఓయీ? నీవెవ్వరవు? యిటకు రాజనేమి?

రావ— అవ్వా? భిక్షాందేహి?

సీత— భిక్షమిదే గైకొనుము?

## 26 బెహాగ్ — త్రిశ్రజాతి

1. ఎవరిదాన వేతొమ్మ ? ♦ విభుడెవ్వడుముద్దుగుమ్మ ॥ప॥
పవినయముగనీసంగతి సభయాగ్రోనాశ్చర్యమాయెను
ఇవ్వనినుండేమిపనియో ♦ ఎవ్వరునీవెంటలేరు ॥ప॥
2. సుకుమారివిజనితోచను ♦ అకటకటా ? నినుజూడగ
నీకిటులవాగ్రసెవాబ్రహ్మ ♦ నిక్కముగాయడవినుండ ॥ప॥
3. నీదేశంబేదో యికనందే ♦ హింసచకదెల్పుము
ఇందుండగఏమితలమో ♦ సుందరివేగమెదెల్పుము ॥ప॥
4 కోకిలవాణిరోనిను ♦ యీకీశాగణ్యమునుండంగ
ప్రాకటముగవీరరెడ్డి ♦ భగవంతునివంకల్పము ॥ప॥
తల్లీ! నీసంగతినంతయు దాచకదెల్పుమువిన కోరెద

సీత — మహాత్మా! నాసంగతియూ

సీ॥ దశరథేశుండని ♦ యశముగాంచినయట్టి
కోసలేంద్రునిపెద్ద ♦ కోడలేను
ప్రజలబిడ్డలమాడ్కి ♦ పాలించుచుండుయూ
పుణ్యాత్ముడౌజనకు ♦ పుత్రినయ్య
దైత్యులమర్దించి ♦ ధరణీభారముమాన్పు
రామచంద్రునిముద్దు ♦ రాణినయ్య
తండ్రివాక్యముదీర్ప ♦ తిమ్ముననుకూడి
యుగుదెంచెనానాథు ♦ డవులకును॥

తే॥ గీ॥ ఇచ్చటుండగవచ్చెనొక ♦ వింతలేడి
పట్టితాకివ్వవేగెనా ♦ ప్రాణవిభుడు
మరిదికూడనుపోగెనా ♦ మార్గమందు
వచ్చెనిప్పుడె [illegible] ♦ నిశ్చయముగ॥

అందుచే నిందు నొంటరిగా నుంటిని

రావ- యీ కథా సంగతి వినుము నేను మూల్లోకములను జయించితి సురలచే దా
స్యము చేయించుచున్నాను నా యాజ్ఞకు త్రిమూర్తులు కూడ బద్ధులు.

తే॥ గీ॥ రావణుండను లంక ♦ నా రాజధాని
ముజ్జగంబుల నను బోలు ♦ విజ్ఞశాలి
ఎందు గానరాదుయో ♦ సుందరాంగి
నన్ను గొలతురు నిర్జరుల్ ♦ ఖిన్నులగుచు।

ఇద్దియే సంగతి తెలిసినదా నన్ను బెండ్లాడుమా నీకు సౌఖ్యము కల్గును
యీ యడవుల నేల యిడుమలు బడెదవు నామాట వినుము చెడిపోకుము
వెఱ్ఱిరాముని వెంట నేల యుండెదవు

సీత- ఛీ! దురాత్ముడ యిట్టిమాటలు పలుకకు నా వాలుక వేయి చీలికలు
గాను పో పో మ్రుచ్చు దొంగసన్యాసి!

రావ- (తనలో) పావని నన్ను సన్యాసి యనుకొనుచుండె గాబోలు సీతా
వెఱ్ఱిదానా! నేను సన్యాసి ననుకొంటివా యిదిగో నా నిజస్వరూప
మును జూడుము రావణుండను చెలీ! [పదిశిరములు జూపును]

సీత- అయ్యో నాథా నాథా ఏడెవడు యీ ఘోరరూపము జూచిన నా
కు భయము కల్గుచున్నది రావా రక్షింపవా! మరదీ! నీవైన
రావేమి! అయ్యయ్యో! యీ దురాత్ముడు నన్ను బాధింపుచున్నా
డు. అక్కటా! ఆ మాయలేడి కేల బొమ్మంటిని రమ్ము దేవా శ
మ్ము రక్షింపుము హా! ప్రాణేశ్వరా! హా! లక్ష్మణా! యీ పాపు
డు నన్ను బాధించుచున్నాడు అయ్యయ్యో మరదీ నిన్న కారణ
ముగ దూషించితినే లక్ష్మణా లక్ష్మణా [మూర్ఛిల్లును]

రావ- యిదియే నాకు తగిన యదను రామలక్ష్మణులు రాకమునుపే సీత
ను గొనిపోయెద బాగుగా మూర్ఛిల్లినది బళే యిప్పుడే నారథ
మును నిడుకొనిపోయెదగాక

అయ్యొయ్యో! శృంగారంబు మీరైన నుజాలిలేద వనాంతములారా పోవుచు న్నాడో సురలార రండు రండు రక్షింపుడు.

( ప్రవేశము జటాయువు )

ఆహా! ఎవ్వరు యీ కాననమున విలపించుచున్నారు దశరథుని కోడలను శ్రీరాముని సతిని అని వల్లించుచున్నది ఓహో! పాపాత్ముడు రావణుడుగా వలయు ఆహా! జ్ఞప్తి వచ్చినది దశరథుని కోడలా.

తే. గీ. వసుధ నాకెంత మిత్రుడౌ ♦ దశరథేశు
ముద్దుకోడల దోడ్కొని ♦ యిద్దురాత్ము
డేగుచుండెను కారణం ♦ బేమిగాని
పోయి విడువంగ జేతు ♦ నా తోయజాక్షి!

శీఘ్రమే పోయి సీతను విడిపించి తుమ్ముని మచ్చుమాపెద.

(27) బెహాగ్ — ఏకతాళము

1. పాపాత్ముడ పాపోకు ♦ పోకిరించితివి చాల | పా |
ప పభయము లేక నీవు ♦ పగభామల గొని పోవగ
పాపవు విధి నిన్నిటుల ♦ బుట్టించెన టగ దుర్మార్గుడ | పా |

2. కోపము చేపోవుచుంటి ♦ వావుమ చటనీరథము
లోకమాత రాసీతా ఓపగలవ ♦ జూడుము దుర్గో నీపసందు
తెలియువింక చూపెద నా ప్రజ్ఞ నిన్ను ♦ జీల్చివేతు పాపోకు | పా |

3 భంగపడ్చిపగ స్త్రీలను ♦ దొంగవానిరీతు నీవు
పొంగుచు గొనిపోనుంటివ ♦ కుంగుదువు రుకలు పాత్ముడ | పా |

4. యిట్టి బుద్ధి మానుమిక ♦ మట్టిలోన గల్పెద
జగజ్జెట్టియైన శ్రీరాముని ♦ శత్రుడవై బ్రతుకలేవు
పొట్టచీల్చి వేతు నిన్ను ♦ పోరున గెల్వము నన్ను | పా |

5. ముందు వెనుక జూడక ♦ భూనందన గొని పోతివేని

నిందలపాలైపోదువు ♦ నీవంశంబంతమారు | పా |

6. యెల్లలోకములకుజనని ♦ యిల్లాలితిపాధ్వసీత
సల్లాపములో మనకు ♦ తల్లిరమరకందరకు
కల్లగాదువికిరొద్దిని ♦ గాచినదైవమునతిర
మన్నించునామాటవినుము ♦ మాతను శ్రీరామునకిమ్ము | పా |

అరే! కౄరుడా! పోయిపోయి మిదుగోవచ్చుచుంటి నీపగరడంచెద దుర్మార్గా! రావణా! ఎచటికేగెదవు

[ దగ్గరకుబోయి అడ్డమునిలచును ]

రావ— ఓసీ! నీవశేనన్నువధించుటా! ఏమే పక్షికులమా

తే॥ గీ॥ లోకమంతయుప్రఖ్యాతి ♦ నొందినట్టి
రావణుండనునన్నుదుంచ ♦ చేవగలదె
కాలమాసన్నమయ్యెనో ♦ ఖగమనీకు
రెక్కలనుద్రుంతునిన్నునే ♦ నిక్కముగను॥

జటా— ఛీ! పాపుడా రాముడులేకపోవుటచే బ్రతికితివి రాముడున్న ఈపాటికి యమపురికియరిగియేయుందువు నీచుడా యిదియేమివనిరా

తే॥ గీ॥ రాముదేవినిగొనినీవు ♦ భూమియందు
బ్రతుకజూచివేమియో ♦ పంక్తికంఠ
నిన్నుబరిమార్చబుట్టైను ♦ నిక్కముగను
యిలకునూరినివిడిబుద్ధి ♦ దెలనుకొమ్ము

లేకున్న నీదశశిరంబులు భూమిపైదొర్లాడను యిదిగో విడచెదవా లేదా ఈపితనులోకమాతనువిడువవా ( అని తన్నుచున్నాడు )

రావ— అహా! వీడునన్నులంకకుబోనివ్వడు ఎదురుగా అడ్డమునిలచినదివ
ఔరా దీనిసాహసముకావున దీనిరెక్కలుఖండింతును యి
ట్లుజేసితినేనివీనివనినరి లేకున్నయిదితప్పకనన్నుబాధించును

(ఏమీ పక్షిరాజమా! ఈదెబ్బతో నీవనివరి చూచుకొమ్ము ఎన్న
డునావంటివానిజోలికి రాకుము ( రెక్కలు నరకును )

జటా- హా! సుగుణాభిరామా రామా యినకులసోమా గుణధామా
శ్రీరామచంద్రా! నీదేవినివిడిపించవచ్చిన నాయొక్కరెక్కలు
ఖండించునాడు యీదుర్జాతు అయ్యో దురాత్ముడుపోవుచున్నాడు

( భూమిపైవ్రాలుచున్నాడు )

సీత- అయ్యో! యీజటాయువు నామూలమున నిష్కారణముగా
భూమిపైవ్రాలినాడు అయ్యయ్యో ప్రాణములువిడచుచున్నాడు
యితరుల మేలుకొరకు తన ప్రాణములు విడచున్నాడుగదా! సుర
లారా! యీజటాయువుని ప్రాణములైననుగాపాడుడు నాథా!
నాథా! ఎచ్చటనుంటివి రావా! యికరావా! రక్షింపవా! అ
య్యో! సీతాయొక్కలిపైకోపమా! జీవితేశ్వరా! భగవంతుడా!
నీకైననుదయలేదా! అయ్యయ్యో హాదైవ! నిన్ను అనరానిమాట
లంటినిగదా! మానవులారా! రారా! మొరాలింపరా! ఒకరై
నపలుకరేమి దీనురాలిమొరవినుడు రండు రండు పోవుచున్నాడు.

రావ- సీతా! వ్రీడానా! ఎవ్వరువచ్చినానిన్ను విడిపింపలేరు నన్నెవ్వ
నిగాతలంచితివి నీనాధుడేమిచేయగలడు తిన్నగారమ్ము.

[ గోలునవేయుచుండ లంకకుతోడ్కొనిపోయి రథముదిగ్గించి ]

రావ- సీతా! సకలంకికివ్రాలిత నన్ను బెండ్లాడుము నాయువతులలో రాణి
జేతు నీయాజ్ఞకుబద్ధుడనై మెలంగెద నీయిచ్చవచ్చినట్లువర్తించెద
ఏమి సమ్మతమేనా పలుకవేమి కలికీ రాముడేడ నీనేడ కాంతా
మోదించుకొమ్ము.

తే. గీ. యిచ్చవచ్చినరీతిన ♦ లిరించవచ్చు
తరుణిపోకైనదుస్తుల ♦ దాల్చవచ్చు

చి హాయిగ లంకకు రాణివయ్యెదవు. ( చేతులుప ట్టుకొని తీసుకుపోయెదరు )

[ ప్రవేశము రామలక్ష్మణులు ]

రాము- తమ్ముడా! నామాట పెడచెవిని బెట్టితివి చూచితివా! పర్ణశాల యందు ఎంత వెదకిన గానరాదయ్యె అయ్యయ్యో తమ్ముడా ఎంత దూరమున వెదుకగలము సీతజాడయినుమంతయిన తెలియదయ్యె.

లక్ష్మ- అగ్రజా! యీనదులకైన స్నానమాడుటకు బోయియుండును. లేక ఏపుష్పములగోయుటకైన యరిగియుండును. అంతియేకాని ఇంకెచ్చటికి బోవును రమ్ము వెదకుచు అల్లదిగో అగుపడునది చెంత కేగుదము.

రాము— ఓయీ!

శా॥ ఏమెట్టిత్యుల! మెట్టకాది ♦ దివసంబే! యెన్నిరాముండనో
సౌమిత్రివినునీవురాముండవో ♦ వత్సా! సక్కమేరాముడన్
భూమీశుండను రామచంద్రుడను ♦ హా భూమీజచంద్రానసా
యేమెయెక్కడనున్నదానవి ♦ టురావేయుల్లమల్లాడెడిన్ ।

తే॥ గీ॥ ఏనుజాడంగనందాక ♦ నేగదీవు
ప్రేమనామీదగల్గిన ♦ బ్రియముతోడ
దడవుసేయకవచ్చెదవు ♦ దమకమొంది
పీతకౌశేయధారిణీ ♦ సీతనిలుము।

లక్ష్మ— అన్నయ్యా « మీరుదుఃఖమునువిడచి యధైర్యమునంగట్టిపెట్టినంగాని » మనమింకసీతనువెదుకజాలము.

రాము— సీతా! సీతా! ఎక్కడికిపోతివి.

(28) ముఖారి— ఏకతాళం

ప॥ ఎందుబోతివే ♦ యిందువదనవు ॥ఎ॥

ముందువెనుక తెలియక వ ♦ నందుగాను జేసెమరది | ఎం |

2. యిందునీవులేకయున్న ♦ గుంగుచుంటినాకన్నుల
ముందుకొక్కసారిరావ ♦ ముదితొఒక ముద్దియువ | ఎం |

3. సీతానీవులేకయున్న ♦ నీచతనువునాకేలను
ఏతీరునబ్రతుకగలము ♦ విడచెదనేజీవములను | ఎం |

4. రాజ్యమేలకాంతా! నీ ♦ విటురాకయున్నబ్రతుకజాల
పూజ్యరాలునీవులేని ♦ ప్రజ్ఞయేలనాకుచెలీ | ఎం |

5. చక్కనైవనీయావకు ♦ ఒక్కసారిజూపకున్న నిక్కంబుగ
ప్రాణమిడతు పెక్కుచోట్ల ♦ వెదకితినిఎక్కడనీజాడలేదు | ఎం |

6. భూతలమునకౌతుకపురి ♦ తేతల వీర్రిడివందు
డితేరునవేడుచున్న ♦ యిలనుతనీదయరాద | ఎం |

హా! సీతా! సీతా! ప్రాణేశ్వరి! ఎందుంటివి! యేమనుచుంటివి! అయ్యో క్షవేవులులనోటనైనబడితివా!

లక్ష్మ- అగ్రజా! మనమిట్లుచింతించినచో సీతను వెదుకలేము కావున జాలముచేయక ల్వోరగారమ్ము అముందుకనపడునదిచెంత కేగుదము.

రాము— తమ్ముడ! జానికియింకమనకుకనువడునా అయ్యో

( ఇరువురు నడచెదరు )

[ జటాయువు మెల్లగాలేచి ]

జ- హా! సీతాన్వేషణమున రామలక్ష్మణులు ఈ అరణ్యమందు దిరుగుచున్నారు అదుగో! పోవుచున్నారు పాపముచింతాక్రాంతులై సీతా! సీతా! యనికేకలుసైచుచు పోవుచున్నారు నేనువుడు మెల్లగాపోయివారికి సంగతిదెల్పెదఅదుగో యిటువచ్చుచున్నారు పోయెదగాక రామా రామా నిలు నిలుపోకు పోకు యిదేవచ్చుచుంటి నే వినీ అచట గుమ్ము.

(సమీపించును)

రాము- తమ్ముడా! అహా మనకింకను రాక్షసబాధలు తప్పవు అనుకొం
అటచూడు ఘోరాకారముతో నిలు నిలుమని వచ్చుచున్నాడో
లక్ష్మణా! చూచితివా ఓరీ కలుషాత్మా! నా సీతనెట దాచితివి.

తే. గీ. ఓరి కలుషాత్మ దానవ • చేరరమ్ము
శత్రునైతివి నీవు నా • సీతమ్రింగి
అంతమొనరింతు తమ్ముడా • ధనువు నిమ్ము
మచ్చుమాపెద తుచ్ఛుని • నిశ్చయముగ ||

లక్ష్మ- అగ్రజా వాడెవడో ముందారయవలయు

జటా- రామా రామా నేను జటాయువనే పక్షిరాజును పుణ్యాత్ములార
మీ తండ్రికి నే బ్రియమిత్రుడ! (దగ్గరకు చేరును)

రాము- పక్షికులమా! అయ్యయ్యో తెలియక నీపై దుర్భాషలాడితి నే
నుండు కష్టదశను బట్టి యిట్లంటిని

లక్ష్మ- ఖగమా నీవిట్లుండుటకు కారణంబేమి

జటా- అయ్యో! ఏమిదెల్పుదు

(29) కల్యాణి — త్రిశగతి

1. శ్రీరాఘవ యిటు వినుమ • నా యఘములెల్ల బాపుమ శ్రీ | రా |
అఘమనకను రావణుండు • అతివను గొనిపోవుచుండ
జగతిపుత్రిక దుఃఖము • చెప్పనాకనోరాదదు | రా |

2. గోలుగోలుమని జానకి • గోలబెట్ట చెవులసోకి
జాలిగల్గి నే సీతను • జనువకుమాప అడ్డగించి
కూలదన్నితి విరథము • క్రొవ్వడగించితి వానిని | రా |

3. కట్టా యారక్కసుండు • దుష్టుడై మాటవినక
బిట్టంబగు నారెక్కలు • త్రుంచిన పడియుంటినిచట | రా |

క్రూరజంతువులుగాని, మనుష్యులుగాని, మరలుగాని, ఎవ్వరైననునా పొట్టపాలై పోవుచుండగా! చుట్టునుదశయోజనముల దూరమునను‌న్న దేదియైనను నాబాహువులలో బడును. కానిఏమి కారణమో తెలియదు నేటి కిటులమారినదేమి చెప్పవా?

తే॥ గీ॥ అక్కటా! క్షుద్బాధనే నెట్టు ♦ లనుభవింతు
భుక్తి లేదాయెనాళ్ళు ♦ పొట్టనుండి
కారణము తెలియదాయెనీ ♦ కాననమున
జీవులిక లేవోయటుగాక ♦ దైవమారయో!

( అనిచేతులుచాపి తడుముకొనును రామలక్ష్మణులు వచ్చి వానిచేతులలో బడుదురు )

రాము- తమ్ముడా! యిదియేమివింత యీమహారణ్యమధ్యంబున మనము కారణముగ మృతినొందవచ్చెగాబోలునోరా!

లక్ష్మ- అన్నా తాళుము యింతతొందరేల?

రాము- అయ్యో! యింకెక్కడి తాళుట కొండలవలెపాకివచ్చుచుండెను మధ్యచిక్కియుంటిమి అయ్యో! తమ్ముడా! అదియేమి కొండలనడుమ ఒకచిన్న మహాబిలము కన్పడుచున్నది. సోదరా యింకేమున్నది ఓ చెనటిదైవమా నీకేమిపగయొనర్చినారము. నీయొక్క చర్యలాయివి

కబం- అహా! అనుకొన్నట్టుదొరకినది నాపొట్టనిండునిక యిర్వురు మనుష్యులు నాచేతిలో జిక్కిరి యింకెక్కడికి పోదురు అరే! నరులారా నేడుమిమ్ము నాపొట్టపెట్టుకొందు.

లక్ష్మ- అదిగో నడివినవచ్చుచున్నది వీడెవడో మాయదానవునివలె దోచుచున్నది కొండలవలెకన్పడునవి తనచేతులు కావలయు.

రాము- తమ్ముడా నడివినవచ్చుటకాదు కొండలవలెనున్న తనచేతులతో

ఎట్లుమనల చేరతీసుకొనుచున్నాడో అదుగో ఆకన్నులు మహాబిల
మువలెనకోరు యుకమునబిగించుకొనుచున్న హా! జానకీ! జానకీ! నీకొ
రక్తకాసనదిరుగచుండ వీడెవడో నీరామునిమ్రింగుచున్నాడు
అయ్యయ్యో.

లక్ష్మ- అన్నా! మ్రాట్లాడుచున్నాడు వీడెవడో అడిగిచూచెద క్రూరుడా
దారిలోనోరుతెరచుకబడియుంటివెవ్వడవు?

కబం- ఓరీ! నరులారా!

(30) కల్యాణి—ఏకతాళము

1. మొక్కెడికిబోదురింక ♦ నిక్కముగమ్రింగెదమిమ్మె | ఎ |
టక్కరినరులారయిక ♦ నొక్కివేతుమిమ్ములను
మక్కువతోమిమ్మిద్దర ♦ మెక్కెదనాకడుపునిండ | ఎ |

2. బాగుగానుదొరికితిరిక ♦ జాగుచేయకుండతిందు
యీభగవంతుడు ♦ నాపైయెంతప్రేమతోబంపెనో | ఎ |

3. పంతోమంబయ్యెనునాకు ♦ యింతవరకుఎవ్వడిద్దరు
కాంతులంజిక్కగలేదువింతగు ♦ నరవిందుదొరకెవిరరాఘవునిదయను | ఎ |

(చేతులతోదగ్గరకు చేరదీసుకొనును)

రాము- తమ్ముడా! కష్టములోకష్టమన్నట్లు మనము వీడిచేతిలోజిక్కితి
మి, యిదిఏమివిపరీతము వీనిబారలబడినదమనేఆశతో అదుగో!
ఎట్లుదగ్గరకుచేరదీసుకొనుచున్నాడో

లక్ష్మ- అగ్రజా! వీనినువిరాధునివంటివాడేయయియుండును ఇతడిచ్చ
టనేయుండి తనబాహువులలోజిక్కినవారినితినుచుండును. అని
తోచుచున్నది వీడికిశిరముకన్పించటములేదు విచిత్రముగానున్నది.

రాము- ఔరా! వీనికికన్నులు, తల, కాళ్ళు లేవు కడుపుచేతులుమా
త్రమేయున్నవి వినుమా?

ర్వుడనేను తపమువల్ల పెక్కువరములన్ బడసి మునులకంగారుగ
బెదిరించువాడను నేనొక్కనాడు యీరూపమును దాల్చి స్థూ
లశిరుండను మునివరుదరికిబోతిని అప్పుడమ్మౌని దుర్మార్గుడ యి
దేరూపముగా కన్నులు, తల, కాళ్లులేకుండ కబంధుడవుగమ్మని
శపియించెను. శ్రీరామా! తరువాయి నేననేకవిధముల ప్రార్థిం
చితి మహాత్మా ఘోర రామలక్ష్మణులనీభుజములఖండించునాడు
ఎప్పటిగంధర్వుడవయ్యెదవనియె? యిదియేనా సంగతి రామా
నేప్రాణములువిడచుచున్నాను రామా నీభార్యను రావణుడుగొ
నిపోయెను అతడుమహాబలవంతుడు అతనిజయింపసామాన్య
ముగా తలపకుడు ముల్లోకములకుముప్పుతెచ్చిపెట్టినవాడు

తే॥ గీ॥ నిశ్చయముగబోవుడల్లదె ♦ ఋష్యమూక
మైనయున్న దేశోల్పడి ♦ భానుసుతుడు
పవనతనయుడు మొదలుగా ♦ ప్రాణమిత్రి
వేచియున్నారు సఖ్యత ♦ జేసుకొమ్ము॥

తే॥ గీ॥ దానవపుంజంప ♦ వానరరాజుతోడ
మైత్రిజేసితివేని భూ ♦ పుత్రిదేవ
బాహుబలులగువానర ♦ బలముగూర్చి
కాంతవెదుకంగ హనుమంతు ♦ కారకుండు॥

సీనపోయినను సుగ్రీవుడు వాలినిదంపగలడు వానరసైన్యముచేనీవు రా
వణునిజయింపగలవు రామా! నీమూలమున ధన్యుడనైతి ప్రాణములు
పోవుచున్నవి. (విడచుచున్నాడు)

లక్ష్మ— అగ్రజా! కబంధుడు తెల్పినప్రకారం ఋష్యమూకపర్వతమునొ
ద్దకుపోవుదము నడువుము.

రాము— తమ్ముడా

(ప్రవేశము)  [సుగ్రీవుడు—హనుమంతుడు]

సుగ్రీ- హనుమంతా! మనకెన్నటికైనా వాలిపెట్టుబాధలు తప్పవా! అయ్యయ్యో! అతడుపెట్టుబాధయింతింతయని చెప్పరానిదిగదా!

హను- సుగ్రీవా! విచారింపకుము మనకష్టములెప్పటికైనను గట్టెక్కకపోవు దురాత్ముడు తప్పక నశించు వానికి కాలమాసన్నమగుచుండెను.

సుగ్రీ- అయ్యయ్యో! తమ్ముడనియైన తలంపక నా భార్యనుకూడ అపహరించినాడుగదా.

హను- సుగ్రీవరాజా! కొంతకాలమోపికపట్టుము జీవునకు సుఖదుఃఖములు సమములు.

సుగ్రీ- (ఆశ్చర్యముతో) హనుమంతా! అటుజూడుము వారలెవ్వరు ధనుర్ధారులై వచ్చుచున్నారు మా యన్న వాలిపంపిన వచ్చువారని యోచించుచున్నది అయ్యయ్యో! ఆంజనేయా! ఎట్టియిక్కట్లుపెట్టుచుండెనా దురాత్ముండు

(32) పూరికల్యాణి — చాపుతాళము

1. వచ్చువారలెవ్వరో ♦ వాయుజ గనుగొనిరమ్మా |వ|
అచ్చెరువయ్యెను నాకు ♦ నిశ్చయముగ వాలిపంపు
శత్రునృపులని తోచుచుండె ♦ మ్రుచ్చలిక్షత్రియులబోలి |వ|

2. హనుమంతా! మా యన్నయె ♦ అంతముజేయగ మనల
ఘనబలులనుబంపుచుండె ♦ కార్ముకధనువులుబూని
యినకులులనుబోలియుండె ♦ యింకను నాకేదిగతియ |వ|

3. పూర్వంబున నేనెట్టి ♦ పుణ్యులజంపించినానో
వైరంబున నాడునుడుట ♦ వనజభవుండీలవ్రాసె
కార్యక్రమమూహించుము ♦ తనుమా వేవేగజనుము |వ|

4. అయ్యయ్యో! వాలియిపుడు ♦ కయ్యమునకు బంపుచుండె

చయ్యననీవేగివారి ♦ నెయ్యముగామాట్లవలయు
తొయ్యలిరాజ్యముగొన్న ♦ తవిదీరకమాయన్న
భయమొందినననుదంపగ ♦ బంపెడుమృత్యువులబోలె ॥ వ ॥

5. శాంతముచేసీవువారిచెంతకరగి ♦ వవినయముగ
సుంతయైనయలుగక ♦ వృత్తాంతమంతదెలియుమ యయ్య
వంతనమునవారలతో ♦ సఖ్యతయొనరింపుమయ్యా ॥ వ ॥

6. భూతలమునకౌతుకపురి ♦ తేతల వీరిడ్డినేలు
శ్రీకాంతునిబోలియుండె ♦ శశిభాములవలెయిద్దరు ॥ వ ॥

కావున తత్క్షణమేపోయివారిసంగతినంతయు కనుగొనరమ్ము బహుజాగ్రత్త సుమీ! పొమ్ము

హను- సుగ్రీవరాజా! భయపడకుము నేనుపోయి వారిసంగతినంతయు కనుగొనివచ్చెద వారువాలిపంపినవచ్చినవారుకారని నాకుతోచుచున్నది.

తే॥ గీ॥ భయమువీడుముజనియెడ ♦ భానుపుత్రి
దుష్టులైనవారగల ♦ నిష్టపరతు
మంచిమాటలచేవారి ♦ మాయమింతు
మిత్రులైననునీతోడ ♦ మైత్రిజేతు॥

నీవుభయపడకుము నేనిదెపోవుచుంటిని ఒకవేళవాలిపంపినవచ్చినవారలైననన్నేమిచేయుదురు మీరుయిందుజాగ్రత్తగానుండుడు పోవుచున్నా సుగ్రీవా వారుదనుర్బాణులైవచ్చుచున్నారు ఎవరోవేటకువచ్చినమార్గస్తులు అయియుండవచ్చు అంతయు కనుగొనివచ్చెద (నిష్క్రమించును)

సుగ్రీ- వానరవీరులారా! హనుమంతునిమీదకలియుబడరుగదా!
పాపమునాయాజ్ఞమీదపోవుచున్నాడు.

సుషేణుడు సుగ్రీవరాజా! హనుమంతునికి మరేమీ భయములేదు

కాన మీపర్వతశిఖరముమీద కూర్చుండి సంగతంతయును
జూచెదము రమ్ము (పర్వతమెక్కుచున్నారు)

రాము- తమ్ముడా? అతడెవడో యిటువచ్చుచున్నాడు అతడొక రాక్షసుడు కాడుగదా?

లక్ష్మ- అగునా? మనము ముందే జాగరూకులమైయుండవలయు దురాత్ముని యిప్పుడే వధించెద ఆలసించిన బన్నములబడుదుము

హను- (తనలో) అహా! అతడు చాపము నెక్కుపెట్టుచున్నాడు దానవుండనియెంచెనేమో! త్వరగాపోయి నమస్కరించెద అయ్యా నేను దానవుండనుగాను (సమీపించును)

హను- అయ్యా! వందనములు

రాము- ఓయీ! నీవెవ్వడవు

హను- మహానుభావా! నేను సుగ్రీవుండను వానరేంద్రుని సేవకుండ అతడు ఋష్యమూక పర్వతముమీదనున్నాడు

రాము- నీవు యిచ్చటకు వచ్చిన పని యేమి?

హను- "సూర్యతేజులు! శుభాకరులు మహావీరులునైన మీరెవ్వరు"

(డైలాగ్) (33) జంగ్లా—ఆటతాళము.

హను- ఏదేశమయ్యా! ♦ మీనామధేయమేమందురయ్యా | ఏ |
యిందు రాపని యేమొ మీకు ♦ సందియంబును లేక దెల్పుడు
వందనంబులు చేతు దివ్య ♦ సుందరాకారులు మీరు | ఏ |

లక్ష్మ- సాకేతపురమూ ♦ వనచరమా కు జన్మస్థావరము | సా |
రాకుమారులమయ్య మేము ♦ నాకు యీతండగ్రజుండు
భీకరాంకానలనుందుము ♦ పేరు రామలక్ష్మణులము | సా |

హను- ఎవరూ మీతండ్రి. ♦ అవసరమేమో కారడవినుండి | ఎ |
రవికులంబునందు బుట్టి ♦ రాజ్యరమలనువిడచిపెట్టి

ఇవ్వనంబున నుండనేమి ♦ ఎఱుగ దెల్పుడు శూరులార

లక్ష్మ- దశరథేశుండు మముగన్నతండ్రి ♦ తల్లులిద్దరు | ద |
విశదముగ మా నవతి తల్లికి ♦ యిచ్చె జనకుడు రెండు వరములు
వసుధ సుతునకు నొసగి కైకా ♦ వనము దిరుగా బంపె నమ్మ | ద |

హను- యిక్కాడికేల వచ్చితిరయ్య ♦ నిక్కముగాను | యి |
చక్కని గుణధామా మోముకళలు ♦ చాల తరిగెవ దేమి
ఎట్టి చిక్కుల బడుచునుంటిరో ♦ చెప్పుడీ యవితోల గజేతును | యి |

లక్ష్మ- క్రూరాత్ముడెవడో ♦ యాతని నతివిగోని పోయెనయ్యా | క్రూ |
నారి వెదకుచు ఘోరవనిలో ♦ చేరవచ్చితి మయ్య యిటకు
ధీరుడవు నీ వెరిగియుంటె ♦ దెల్పుమా యా కాంతజాడలు | క్రూ |

హను- రవికోటితేజ ♦ గిరిపైన గలడు సుగ్రీవరాజా | ర |
పవనతనయుడనేను ♦ యతనికి బంటునౌదును
అంజనేయుడ ♦ నవినయింబుగ మిమ్ము
యతిసితో సఖ్యతను ♦ యొనగూర్చువాడను | ర |

రామ- సోదరా ? యితడు ♦ మనకోర్కెలెల్ల నెరవేర్చువాడు | సో |
మోవమునవ్వి రెడ్డివరదుని ♦ పాదభక్తుండెనుచుదోచను
ఆధరాత్మజ దేవ యితడ ♦ యనుచు చెప్పెను కబంధుకూడ | సో |

హను- రామలక్ష్మణులారా! సుగ్రీవుడు అన్నయగు వాలిచే గెంటింపఁబడి భయభ్రాంతుడై యున్నాడు. అతడు మీతో స్నేహము జేసుకొనును అందునిమిత్తమై నన్ను మీ పీటికంపెను రామచంద్రా నేను మీ దర్శనమున ధన్యుడనైతిని.

రామ- అంజనేయా! అన్నచే గెంటింపఁబడెనంటివి కారణమేమి

హను- రాఘవా! దెల్పెదవినుము

తే। గీ। వినుము రాఘవ దెల్పెద ♦ విశదముగను

వాలిసుగ్రీవుకిష్కింధ ♦ నేలుచుండి
అంతసుగ్రీవుపతినా వాలి ♦ అవహరించె
తరుమ ఋష్యాగిరిమడుగున ♦ దాగియుండె।

అందుచేసుగ్రీవుడు భయముచేమమ్ము వెంటబెట్టుకొని ఋశ్యమూకర్వత తమీాదకివచ్చినాడు మహాత్మా? ఆతడును సీవలెఆవదలమునింగియున్నాడు అగ్నిసాక్షిహాము జేసుకొని వాలినివధించెదవేని సీదేవినిదెచ్చినీకాళ్లముంగు బెట్టెద ?

రాము- సెబాస్! హనుమంతా! తెలసినది అతడునునావలెనేదిక్కుల
బడియున్నాడు నడువుమతనిదరికిబోవుదము (నిష్క్రమించును)

సుగ్రీ- అయ్యో? హనుమంతుడు వారినిటకుతోడ్కొనివచ్చుచున్నా
డు ఏమిచేసెనో తెలియదు

(ప్రవేశము రామలక్ష్మణ హనుమంతులు)

సుగ్రీ- మహాత్ములెవ్వరో? మీాకువందనము

రాము- సుగ్రీవా! నీకుజయమగుగాక ?

హను- సుగ్రీవరాజా? యితడురాముడు అతడులక్ష్మణుడుతండ్రివాక్య
ముకొరకువీరుఅడవికివచ్చిరి యితనుభార్యను రావణుండుతీసు
కుపోయెను యితడునుసీవలెకష్టములజిక్కియున్నాడు

సుగ్రీ- రామలక్ష్మణులారా! చింతింపకుడు రావణునిజయించి సీతమ్మ
నుదెచ్చెద

తే। గీ। నిక్కముగ జెప్పుచున్నాను ♦ నీలవర్ణ
ఒక్కగంతుంబారధి ♦ చక్కగాను
దాటిదెచ్చెదసీతను ♦ నేస్థైర్యముగను
రావణుండననెంత ♦ నాచెంతరామచంద్ర

రాము- నిక్కముగాసీతజాడ దెచ్చెదవా? వాలినివధించి కిష్కింధకు

రాజు కేసెద ?

సుగ్రీ- అట్లుజేసెదనని నా చేతులో చెయివేయుము

రాము- సుగ్రీవుడా! చింతింపకు

తే. గీ. సూర్యచంద్రులసాక్షిగ ♦ సూర్యపుత్ర
వాలిజంపియుభూమిని ♦ స్నేలజేతు
అట్లుజేయకయుండిన ♦ అగ్నిసాక్షి
సీవున మ్రొక్కుము సుగ్రీవ ♦ నిక్కముగను।
యిదిగో సాక్షిభూతము (చేతిలో చెయివైచును)

సుగ్రీ- అట్లయిన రాఘవా! యిటువినుము

తే. గీ. అన్నవాలినిజంపిన ♦ నన్నధిపుజేయ (పంచపాది)
లెక్కలేనట్టికపిసేన ♦ నిక్కముగను
వేగవయకూర్చినీభామ ♦ వెదుకబంపి
చింతతీర్పకయున్ననే ♦ స్వాంతమందు
భూమ్యాకాశములసాక్షి ♦ రామచంద్ర।
యిదిగో సాక్షిభూతము (చేతిలో చెయివైచును)

రాము- సుగ్రీవా! బుద్ధిమంతుడైన యీహనుమంతుడు మన యిరువుర
కున్నేహముగూర్చెను చాలసంతసించితి పిలువుముతక్షణమే వారిని.

—: నీలుడు :—

సుగ్రీవరాజా! నమస్కారము (ఆతురతతో)

సుగ్రీ- ఏమి! తొందరగా బల్కుచుంటివి

నీలు- మహారాజా! ఏమిచెల్పుదు మీయన్నవాలియుద్ధమునకు బయ
లుదేరివచ్చుచున్నాడు దేవా!

రాము- సుగ్రీవా! రానిమ్ము వానిప్రాణములుదీసెద హనుమంతా!
నడువ్రడిపోవుదము

సుగ్రీ- రామచంద్రా? రమ్ము ఆవైపున కేగుదము (నడచెదరు)

సుగ్రీ- శ్రీరామా? నీవీ చెట్టుచాటుననుండుము నేను మాయన్నను యుద్ధమునకు బిలచెదను నేను కలియబడడముతోడనే బాణమేయవలయును లేకున్నా నాపనిసరి?

రాము- సుగ్రీవా! భయముజెందకు కదనంబు కేగుము నేను మీ అన్నను తప్పక వధించెద

సుగ్రీ- అట్లయిన రామా! యిదిగో పోవుచుంటిని అన్నమాట చెల్లించుకొనవలయును సుమా!

రాము- సుగ్రీవరాజా? నీమదిని సందేహము మానుము నేను కల్లబొల్లిమాటలాడువాడనా? (రాముడు చెట్టుచాటున కేగును)

సుగ్రీ- దురాత్మా సోదరుభార్యను గొని విర్రవీగుచున్నావా! రమ్ము నీ పని నేటితో సరి.

తే. గీ. ఓరితుచ్ఛుడరమ్మురమ్మా ♦ వాలియిపుడు
మదమడంచును సుగ్రీవు ♦ కదనమందు
ఎందుబోయెదవింక గ ♦ ర్వాంధకార
అలిగొంటివినీపాలి ♦ యంతకుండ!

వాలి- ఓరి? తులువా పారిపోకు పారిపోకు వచ్చుచుంటి ఎన్నిసార్లు వచ్చినను పారిపోవుటయే నీపని చెనటీ?

తే. గీ. యిసుగొనవచ్చితి సుగ్రీవ ♦ కదనమునకు
నిలువుము కాలు పాశ్చిన్నదే ♦ నిల్గజేతు
కారులాడకు దగ్గర ♦ చేరరమ్ము
కాలమాసన్నమయ్యెని ♦ కక్కసుగనీకు!

నీచహృదయా! రమ్ము నీ వుచ్చమూపెద ప్రగల్భములు పలుకుటయే కొంటివా రమ్ము

సుగ్రీ వాచాటప్రేలబోకు రమ్ము (దగ్గరకు చేరుదురు)

[డైలాగ్] (34) జంగ్లా—ఆదితాళము

సుగ్రీ— వాలీయిటు రారాపోరగ ♦ నీసాగరద చెగబలశాలీ ।ఇ।
ఆలిరాజ్యము అపహరించినాడవు ♦ కాలురీతి బాధపెట్టినాడవు
నీపాలికాలుడైతినేనుఇప్పుడు ♦ ప్రాణమూపదీయవచ్చుచుంటిని।వా।

వాలీ- క్రూరా నీకేల తహాగరా? ♦ రూపికికందబల్ ।క్రూ।
వారుతెల్లమానుభానుపుత్ర ♦ గర్వమడతు తన్ని
యీడ్చియుద్ధగపారి ♦ పోయిమరలవచ్చుచుంటివ
బీరముడతు ♦ నోరుమూయుమింకను ।కూ।

సుగ్రీ- సౌఖ్యంబులలో దేలుచుంటివిక ♦ ముఖ్యంబుగనీతు ప్రోడగించెద
వఖ్యాతయొక్క సాధగవంతుడునాకు ♦ నపుయించునుసిద్ధుణంబు
లో ।వా।

వాలీ- ఘాతకనిను నేజంపకవిడువను ♦ తేతలవీరౌద్రివరదునిబలమున్
చూతునుగానికవిడదిపెదుదునా ♦ సుగ్రీవాయీదెబ్బతో చావు ।కూ।

(కలియబడెదరు)

రాము- (తనలో) ఔరా? ఏమివాలిశౌర్యము బలే? క్రిదబొన్ఘంచు
చున్నాడుసుగ్రీవుని వాలీ? ఏమినీపౌరుషముమరచితిని సుగ్రీవు
నిఅభయమిచ్చితి గానవాలినివధియించవలెను

కీర్తన- అభయమిచ్చితిసుగ్రీవునకు * అంతముజేసెదవాసవపుత్రుని
రభసంబున యీబాణముచేత * వృథయులకోర్కెలుఎల్లనుతీరును ।అ।

[బాణమువదలును]

వాలి- హా! హా! చచ్చితి! చచ్చితి! (అనిపడును)

సుగ్రీ- అయ్యో! అగ్రజా! నిష్కారణముగానిన్నుజంపించితినే
[వాలిపైబడి] అన్నా! అన్నా! అన్నా! ఎంతపాపుడనురా

సోదరప్రాణములుఁ గొంటిని

తే. గీ. కటకటా ఎంత పాపంబు • కట్టుకొంటి
ఒడలు తెలియక దుష్కార్య • మొనరగొంటి
అగ్రజానుజా చు భాగ్యమిం • కబ్బదాట
ఎన్నుబోలిన మూర్ఖుఁడిం • కున్నవాఁడె!

వాలి- సోదరా! చింతింపకు విధివ్రాఁతకెవరుకర్తలు వూరడిల్లుమూరడి ల్లుము. ( రామునిగాంచి ) రామా! రఘుకులాభిరామా! యిదియేనా! నీధర్మము శ్రీరామచంద్రా! గుణసాంద్రా! బుద్ధిగలదా లేదా! లేకనీవునుమావంటిమృగజాతివేనా ఏమి పలుకవు ఎంతజేసితివయ్యా? యినకులరామా!

తే. గీ. కోతిమూకనమ్ముతిందురా • భూతలమున
ఘాతకుండవునను జంప • హేతువేమి
దొంగతనమున నన్నిట్లు • భంగపుచ్చి
భూమిగూల్చితివేర శ్రీ • రామచంద్ర!

రాము- నీవంటిదుష్టులను దుర్మించుటకే భూతలమున బుట్టితిని నీచాత్మా! సోదరుభార్యను అవహరించితివి దోషముగాదా?

వాలి- రామా! రామా! మాట్లాడజాల ప్రాణములుపోవుచున్నవి నా ముద్దుకుమారునంగదునేమిజేసెదవు రఘుకులసోమా! తప్పుసైరించుము నేనికబ్రతుకజాల ముక్తిపదవిదయచేయుము

( ప్రాణములువిడచును )

రాము- సుగ్రీవా! వాలివధ అయినది యికమనకార్యము జూచుకొనవలయు గతించినదానికి చింతించిన ప్రయోజనంబేమి రండుపోవుదము

హను- రామా! నడువుడు సీతాంబను యికముఖులోదెచ్చిమీముందు బెట్టెదము. [ నిష్క్రమింతురు ]

[95] పూరికల్యాణి — చతురశ్రి.

1. మంగళమిదిగో నుమా ♦ శ్రీరామచంద్ర |మం|
రంగుమభక్తులెల్ల ♦ రంగుగదర్శించెదము
గజజనకమమ్మ ♦ ఆదరించరదేవ | మం |

2. పాలనేతుంబించి ♦ వాలిపాలిటకత్రి
మేలుగభానుపుత్రు ♦ నేలినమిత్రుడయా | పా |

3. కౌతుకపురివాస ♦ తేలలవంశాబ్ధిపోష
ఖ్యాతిగవీరరిద్దిదాన ♦ గాంచినశ్రీరమేశ | మం |

వా లి వ ధం.

సం పూ ర్ణ ము

శ్రీరామార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ



విద్యావినోదినీప్రెస్ రామచంద్రపురం 1000 ప్రతులు